కాలేజీలో చేరినాక తన క్లాసులో అడుగు పెట్టడం శంకరానికి ఒకవిధంగా ఇదే ప్రథమం. ఇవాళే మంచిరోజని వారంరోజులక్రితమే స్వగ్రామం విడిచేముందు తల్లి మరీమరీ చెప్పిపంపింది. కాని ఈరోజుదాకా కాలేజికి డబ్బు కట్టకుంటే పినాల్టీ కూడా కట్టవలసి ఉంటుంది. అందుచేత రెండు రోజులక్రితమే ముందుమాత్రం చెల్లించి, తల్లిమాట ప్రకారం ఇప్పుడు క్లాసులో ప్రవేశిస్తూ కుడికాలే ముందుపెట్టానని శంకరం తృప్తిపడ్డాడు.

అయితే వెంటనే మరొక సందేహం కూడా బయలుదేరింది. కాలేజిమెట్లమీద ముందుగా కుడికాలే పెట్టానా అని_ అయితే, క్లాసులో ఉన్న పెద్దగేలరీ తనదృష్టిలో పడేసరికి, అదికాస్తా మాయమై, ఇప్పుడు తనెక్కడ కూర్చుంటే సబబుగా ఉంటుందో అనే కొత్తసందేహానికి చోటు ఇచ్చింది. ఆ గేలరీ చూసేసరికి తనగుండె కొద్దిగా దడదడ

మంటూ కొట్టుకోనటం ప్రారంభించింది. అప్పుడే కాస్తగల్లంతు చేస్తూ, కొత్తగా అగుబడటంవల్ల నేమో తనముఖమే తేరిపార పరీక్షిస్తూ, గుసగుసలు ఆరంభించిన తోటి కుర్రవాళ్ళను చూస్తున్న కొద్దీ తనకు భయంవేస్తూనే ఉంది.

ద్వారందగ్గర అట్లా అయిదారు నిమిషాల తనకు తెలీకుండానే నిలపడి, గంట వినపడే సరికి ఒక్కసారి తుళ్ళిపడి తొందరగా ముందు సీటు లోనికిపోయి కూర్చుని, ద్వారంవైపే చూస్తూ లెక్చెరరు వచ్చేసరికి ఏంచేయాలో - నిలపడాలో మరే ఆచారమో ఇక్కడ - ఏమీ తెలియక ఆలోచిస్తున్నాడు శంకరం.

మరుక్షణంలో మెట్లమీదనుండి దడదడమనేచప్పుడు వినపడింది. ఆశబ్దంతో క్లాసంతా ఒకేసారి మూటు మణిగింది. గేలరీలోనివారంతా దిగ్గుమని లేచి నిలపడేసరికి చప్పున తనూలేచి నిలుచున్నాడు శంకరం.

ముందు లెక్చెరరు - ఆ వెనక నారీరత్నాలు! ఒక డజనుపైగా ఉంటారనుకుంటాను - వారికోసం ప్రత్యేకం ముందుఖాళీచేసిన మూడుసీట్లలో ఒక్కుమ్మడి అంతా ఆక్రమించుకున్నారు — టకటకమని చెప్పులతో మరింత శబ్దం చేస్తూ. వెనకపడింది కాబోలు-అలసిపోతూ తొందరగా లోనప్రవేశించింది మరో రత్నం...... మొట్టమొదట ఆమె కనపడింది శంకరానికే.

శంకరాన్ని ఆమె ఒకసారి చూసి 'ఉహ్' అనుకున్నట్టు ముఖంపెట్టి, తనసీటులోనికి పోతూ పోతూ గుడ్లు కనుగొలికల్లోనికి పోనిచ్చి, ముఖం తిప్పకుండానే మళ్ళీ శంకరం కనపడతాడేమో అని వ్యర్థప్రయత్నంచేసి కూలపడింది.

నిర్మలను ఆసమయంలో మొట్టమొదటగా చూడటంతో శంకరం చప్పున విస్తుపోయి ఉంటాడనుకుంటాను. ఎందుచేతనంటే నిర్మలకూడా తన క్లాసే చదివేటందుకు సిద్ధంగా ఉన్నదని అంతకు

ముందు శంకరం అనుకోని ఉండలేదు!

శంకరం ఈవిధంగా ఆశ్చర్యపడటానికి కారణం లేకపోలేదు. ఇంతకు కొద్దికాలంముందే తనకు ఈవిగ్రహాలతో ఏమాత్రమో ముఖాలు చూసుకునే పరిచయం ఉంది. ఆకథ చెపతాను వినండి.

తను స్కూలుఫైనలు ప్యాసుకాగానే పట్నం పోయి పెద్దచదువు చదువుకోవాలని శంకరం చాలా మట్టుకు ఉబలాటపడ్డాడు. తల్లి తన ఉబలాటాన్ని ఆమోదించిందే కాని ఒక్క కొడుకూ అక్కడ ఏ ఇబ్బందులు పడిపోతాడో అని తన భయాన్నంతా వెళ్ళగక్కింది. యుద్ధానికి తరలిపోయే యోధుడి లాగ శంకరం తల్లిముందు పెద్ద పెద్ద మాటలాడి పట్నం బయలుదేరాడు. అతను చెయ్యబోయే పనులన్నిటికీ తల్లి మంచిరోజులు ఏర్పరచి ముహూర్తాలు కూడా పెట్టింది.

తల్లి ఊహ ప్రకారం శంకరం స్వతహాగా చాలా అధైర్యస్థుడని చెప్పటంమకు ఎంతమాత్రం

వీల్లేదు. పట్నం చేరగానే ముందుగా హోటలుకు పోయి అక్కడ తన పెట్టె పరుపూ పడేసి, తీరిగ్గా గది కోసం తిరగటం మొదలు పెట్టాడు శంకరం.

కాలేజీకి దగ్గరలో ఉంటేనే అన్నివిధాలా మంచిదని రెండుమూడు దగ్గర మేడలు పరిశీలించాడు 'టు లెట్' బోర్డులు అగుపడతవేమో అని. అటువంటిదేమీ అగుపడకపోవడంచేత, పట్నాలలో అద్దెకిచ్చే ఇళ్ళకు ఆబోర్డులు తగిలిస్తారనే తన ఉద్దేశం కనీసం ఈపట్నానికి వర్తించదని అనుకుని, తనకు తోచిన మేడదగ్గర ఆగి, లోనివాళ్ళకు వినపడేటట్టుగా "ఏమండీ!" అని కేకవేశాడు. ఆ కేకకు ఎవ్వరూ పలికినట్టులేదు. విసిగి రోడ్డుమీదకువచ్చి మేడపైన చూశాడు. అక్కడ ఒక అమ్మాయి-పదిహేడేళ్ళుండవచ్చును – ఏదోపుస్తకం చేతిలో పట్టుకుని కిందకు తొంగిచూస్తున్నది. ఆ అమ్మాయిని ఉద్దేశించి—

"ఏమండీ! ఇక్కడ గదులేమయినా అద్దెకున్నయ్యా?" అన్నాడు శంకరం.

ఆమాట వినిపించుకుందో లేదోగాని ఆపిల్ల, శంకరాన్ని చూసి చప్పున లోనికి తప్పుకుంది. తన్ను చూడగానే ఎందుకట్లా ఆపిల్ల తప్పుకుందో శంకరానికి వెంటనే తట్టలేదు. మరి కొంచెం సేపటికి దిగువనుండే ఆ ఇంటాయన పైకివచ్చి "ఎవరు కావాలి?" అని పలకరించాడు.

అతన్ని చూశాక శంకరం తాలూకు ఇగిరిపోయిన ధైర్యమంతా తిరిగి కూడుకట్టింది.

"ఇక్కడ అద్దెకేమయినా రూమ్సు—"

"ఎవరికి...మీ కేనా?"

"అవునండి."

"ఇట్లారండి. మేడపైన ఒకగది ఖాళీగా ఉంది, చూద్దురుగాని..." అంటూ ఇంటాయన, వీధిలోనే ఒక పక్కగా ఉన్న గదితలుపు తాళం తీసి శంకరాన్ని రౌండ్ స్టెప్స్ మీదుగా మేడమీదకు

తీసుకుని వెళ్ళాడు.

అతను తన్ను ఎంతగా మన్నిస్తున్నాడు! చాలా పెద్ద కుటుంబీకుడు - కులీనుల వంశస్థుడూ అయి ఉంటాడనుకున్నాడు శంకరం.

గది అన్నివిధాలా తనకునచ్చింది. ఎదురు కిటికీలోంచి కాలేజి అవతల 'సముద్రంకూడా కనపడుతున్నది. ఎలక్ట్రిక్ దీపమున్నూ ఉంది వెంటనే అది స్థిరపరచుకుని అయిదు రూపాయలు బయానాకూడా ఇచ్చి, మర్నాడు దిగుతానని తన పేరు చెప్పి, తాళంపుచ్చుకున్నాడు శంకరం.

౨

తను గదిలో ప్రవేశించిన మరుక్షణమే శంక రానికో క్రొత్తవిషయం తెలిసివచ్చింది. సిన్న మేడ మీదించి తన్ను చూసి చప్పునతప్పుకున్న అమ్మాయి తన పక్క-గదిలోనే ఉంటున్నదని కనిపెట్టాడు. ఆ గదికీ ఈగదికీ మధ్య ఒక తలుపు ఉంది. అవతల గదికి మెట్లు ఇంటిలోపలనుండి ఉండి ఉంటాయని శంకరం ఊహించుకున్నాడు --

ఆ పిల్లచేసిన అలికిడీ-గడబిడా పట్టి తలుపు సందుల్లోంచి కాస్త కనిపెడుతూ శంకరం ఈ నిర్ధా రణకు వచ్చాడు.

ఈ అమ్మాయి ఇంటాయనకూతురు-చదువు కుంటున్నదేమో - ఆమె స్టడీస్ రూమ్ అయి ఉం టుందిది.

సాయంత్రం గది సర్దుబాటు చేసుకొనటం ముగిసే సరికి, శంకరం పూర్తిగా అలిసి చెమ టోడిపోయినాడు. తనకు రోజూ సాయంకాలం

కూడా స్నానం చేసే అలవాటు ఉంది. పైగా ఈ అలసట మీద, ఒక్కసారి స్నానం చేసి వస్తే ఎంత రిలీఫ్ !

మేడమీదనుండి రోడ్డుపైన చూసేసరికి ఆ ఇంట్లో తనింతకుముందు చూసిన కుర్రవాడు బొంగరం తిప్పుతున్నాడు, తనశక్తినంతా ఉపయోగించి గుమ్మాలకొడుతూ. ఆకుర్రవాణ్ణిచూడగానే శంకరానికి మంచి ఊహతట్టింది. వెంటనే తువాలు పైన వేసుకుని కిందకు దిగి "అబ్బాయ్!" అనిపిలిచాడు.

అబ్బాయి వెంటనే తనకేసిచూసి నవ్వుతూ,

"ఎవర్ ? ఎందూకు ?" అన్నాడు.

"స్నానంచెయ్యటానికి వీలవుతుందా ?"

అబ్బాయికి తొమ్మిదిపదేళ్ళకన్నా ఎక్కువ ఉండవు. బహుశా ఆ అమ్మాయి తమ్ముడని శంకరం అంచనా వేసుకున్నాడు.

"లోపలికెళ్ళి అడగండి" అన్నాడా పిల్లవాడు ధైర్యంగా.

అంత కుర్రవాడట్లా అనగలిగాడే కాని, చప్పున లోనికి వెళ్ళేటందుకు శంకరం కాళ్ళాడలేదు.

అప్పట్లో శంకరానికి మరొక మంచి ఉపాయం తోచింది. ఈ కుర్రవాణ్ణి కాస్త మచ్చిక చేసుకుంటేసరి - తన కన్నీ జరిగిపోవచ్చును - జరుగుతై కూడా !

క్షణం ఇటూ అటూ చూసి, "ఇదిగో" అంటూ అబ్బాయిని రమ్మని సంజ్ఞచేశాడు శంకరం.

అబ్బాయి మరేమీ ఎదురుచెప్పక శంకరం ఎదటకువచ్చి నిలపడ్డాడు.

"నీ పేరేమిటోయ్ ?"

నీ కెందుకు అనాలనుకున్నట్టు అబ్బాయి ముఖంపెట్టి, ఎంతో నిర్లక్ష్యం అగుబడేటట్టు జవాబిచ్చాడు—

"రామమోహన్"

"అయితే నువ్వు టూకీగా, రామూనివా మోహన్‌వా ?"

"అదీకాదు-ఇదీకాదు రాము."

అబ్బాయి చాలాగడుసుగానూ చమత్కారంగానూ జవాబు లివ్వటం శంకరానికి మరింత ఉత్సాహకరంగా కూడా ఉంది.

"ఓ... రామువా నువ్వు-బాగుంది. మంచి వాడివి. చూడూ! నేను స్నానంచెయ్యాలి. నీకు మాంఛి ఆపిల్ పండిస్తాను తరవాత-లోపలి కెట్లా పోవాలీ దారి చూపిస్తివా అంటే—"

తన కాపిల్ పండంటే ఇష్టం అని ఇతని కెట్లా తెలిసింది చెప్మా అనుకున్నాడేమో అబ్బాయి—

"అయితే ఇట్లారండి" అంటూ శంకరాన్ని లోనికి తీసుకుపోయినాడు.

మేడేమో చాలా దివ్యంగానే ఉందిగాని, మేడకు తగినట్టుగా మనుషులున్నట్టు శంకరానికి తట్టలేదు! తను పెరట్లోకి పోతూ ఉన్నప్పుడు పక్కగా ఓ గదిలోంచి పడుచావిడొకతె తన్ను కాస్త తొంగిచూడటం గమనించాడు.

స్నానాలగది తలుపు వేసి ఉంది. లోన చప్పుడుకూడా అవుతున్నది.

"ఎవరర్రా లోపల ? వొదినా !"

అబ్బాయి గట్టిగా కేకేశాడు.

"ఎవర్రా ? ఎందుకూ ?"

ఆగొంతు ఆవిధంగా వినటం శంకరానికిదే మొదటిసారి. బహుశా, మేడపైన రెండోగదిలో అలికిడిచేసే మనిషే అయి ఉంటుందని శంకరం ఊహించాడు.

"ఓహో నువ్వా !" అని, శంకరంవైపుతిరిగి, "మావొదిన మీకు తెలీదూ—నిర్మల ?...వొదిన వచ్చాక మీరు స్నానంచేతురుగాని—" అంటూ ఆ అబ్బాయి క్షణంలో తుర్రుమన్నాడు తనమాట మరి వినిపించుకోకుండా.

ఇప్పుడు శంకరం మాంచి చిక్కులో ఇరు న్నాడు. ఎటూకానిచోటవచ్చి ఇరుక్కున్నాడు తను— పైగా ఈ కుర్రాడు ఈమెను 'వొదినా' అంటు

న్నాడు! ఈవరసతో — అసలు ఆ ఇంటో ఉన్న ఫలానావారు ఫలానావారికి ఫలానా అవుతారని తా నిదివరకు నిర్మించుకున్న ఊహాలన్నీ పటాపంచలయినై.

ముందూ వెనకా ఎరగని స్థలంలో ఎటుపోతే ఎక్కడికిపోతాడో అర్థంకాని ప్రదేశంలో అట్లా దిక్కులుచూస్తూ - ఏం జరిగితే అదే జరిగిందని దైవంమీద సమస్తమైన భారమూ వేసి కొయ్యగా నిలపడిపోయినాడు శంకరం.

కాస్సేపు గడిచినాక బాత్‌రూమ్ తలుపు చప్పుడయింది. ఇంక లోపల్నుండి ఆ పిల్ల వచ్చేస్తుందని శంకరం బిక్కచచ్చి ఊపిరికూడా విడవక బిగపట్టి ఉన్నాడు.

నిర్మల గభాలున తలుపు తెరిచి శంకరాన్ని చూసి నిర్ఘాంతపోయింది. ఆ మనిషి అక్కడికి వచ్చినట్టు ఇదివరకటి సంభాషణలబట్టి పోల్చుకుంది-అయితే అతను వెళ్ళిపోయి తిరిగి వస్తాడను

కున్నది కాని శంకరం అక్కడే అంతవరకూ కొరడు కట్టి ఉండిపోతాడని ఆమె అనుకోలేదు.

ఆసమయంలో నిర్మల అట్టే ప్రమాదమైనస్థితిలో ఉందనటానికి వీల్లేదుకాని, ఒక బట్ట మాత్రం అతి నిర్లక్ష్యంగా చుట్టపెట్టుకున్నది పై నుంచి దిగువవరకూ. శంకరాన్ని చూసి సిగ్గుతోనూ భయంతోనూ కుంగిపోయి తలవంచేసుకుని పక్కగా గబగబా లోనికిపోయింది. ఆమె వెళ్ళిపోయినాక శంకరం మెల్లిగా తన ఊపిరి వదులుకుంటూ తనమీద అప్పుడామెకు పట్టరానికోపం విధిగా వచ్చి ఉంటుందని ఒకసారి ఊహించుకున్నాడు...

స్నానంచేసి పైకి వచ్చాడు శంకరం. ఒక పక్కగా ద్వారాలు వరసగా కనపడినై. అందులో ఏద్వారంలోంచి ఇవతలకువచ్చాడో ముందు గుర్తించుకోవాలని అతనికి తట్టలేదు. మేడమీదకింక ఎట్లారా పోవడం అనే సమస్యతో అతని గుండె నీరు కాజొచ్చింది. అక్కడ దగ్గరలో

ఎవ్వరూకూడా ఉన్న అలికిడి కలగడంలేదు.

ఇంక లాభంలేదని బహుశా ఈ ద్వారం లోంచే వచ్చిఉంటాననుకుని, ఒకద్వారంలో జొర పడ్డాడు శంకరం. కాస్తపోగా—

"ఎవరది? ఇట్లాకాదు ఆవేపు వెళ్ళండి" అనేగొంతు వినపడింది.

శంకరం గుండె దడదడాల్ మన్నది. ఆ గొంతు నిర్మలది మాత్రం కాదని రూఢీపరచు కోవడంతో కొంత భయం తీరింది. బహుశా ఆవిడ రాము తల్లి అయి ఉంటుందనుకుని మళ్లా వెనక్కు వచ్చి, మరోద్వారంగుండా, ఎట్లానో బతికి బైట పడ్డానురా దేముడా అని ఆ 'దేముడి' కో నమ స్కారం ఊహించేసి శంకరం మేడమీాదకు పోయినాడు.

తను గదిలో ప్రవేశించే సరికి పక్కగదిలో నిర్మల రాముని కోప్పడుతున్నది.

'అతన్నెందుకు లాక్కొచ్చావ్ అక్కడికి?"

"స్నానం చేస్తానంటే మరి?_ అబ్బ-వొదులూ - చెయ్యి నలిగిపోతూంటే..."

"ఏం_మళ్ళీ తేలేకపోయావ్? అట్లా అక్కడే ఎందుకు నిలపెట్టావ్ ? ఉండు వెధవాయ్_మామయ్యరానీ, నీపనిచెప్తాను -"

'నేన్నిల పెట్టానా అతనే నుంచున్నాడా?' అనుకోకుండా తనమీద ఆ కుర్రాడట్లా ఆ నింద వేసేసరికి - ఈసారి వాడికి ఒక్క లెంప కాయ కొట్టి కసి తీర్చుకోవా లనుకున్నాడు శంకరం-

# 3

సాయంత్రం కాలేజీనుండి వచ్చినాక, ఆవేళ కూడా ఆ కాస్త ఇబ్బంది పడ్డాడు శంకరం. పగలంత ఇబ్బంది లేకపోయిందికాని - సాయంత్రమే ఈ చిక్కు వస్తూ ఉన్నది.

రాత్రి హోటల్లో భోజనంచేసి తోవలో పత్రిక ఒకటి కొనుక్కుని రూం చేరుకున్నాడు శంకరం.

పరుపుమీదే పడుకుని, పత్రిక విప్పేసరికి, ఎవరో వస్తున్న అలికిడిఅయి లేచి ద్వారంకేసి చూశాడు. తెరిచేఉండిన తలుపులు తోసుకుంటూ లోనికి వచ్చాడు ఇంటాయిన.

"ఏమబ్బాయీ! నీకు సౌఖ్యంగా నేఉందా?" నలభైఏళ్లకు తక్కువ ఉండవతనికి - నెరసిన చిన్న క్రాపు - గంభీరంగానే కనబడుతున్నాడు. అప్పుడే ఆ గొంతులో ఎంతపరిచయం అగుపడుతున్నది!

"ఇట్లా కూర్చోండి" అన్నాడు శంకరం అత నికి తన పరుపు చూపిస్తూ.

"మాకేం ఫరవా లేదు-నీకేం ఇబ్బంది కల గడం లేదు కద ? నీపే రేమని చెప్పావూ ?"

"అబ్బే-ఏం లేదండీ-" అంటూ మర్యా దగా తన పేరు మరోమారు చెప్పాడు శంకరం.

అతను శంకరంతో తన పరిస్థితులన్నీ చెప్ప వలసినవీ, చెప్పరానివీ కూడా చెప్పాడు—ఒక అప్పుడిలాగ. అతను చెప్పిన దానికి సారాంశం ఇది—

శంకర శాస్త్రిగారికి ఒక్కడే పదేళ్ళ కొడుకు. మొదటిభార్య గతించగా రెండో పెళ్ళి చేసు కున్నాడు-మొదటి భార్యవల్ల ఒక కొడుకు కలి గాడు.

తన మొదటిభార్య అన్న కూతురు నిర్మల. నిర్మల చిన్నతనంలోనే తండ్రిలేని పిల్ల అవటం చేతనూ, తన కొడుక్కి ఈడుగా ఉండటం—

పైగా మేనరికం అవటం చేతనూ వెంటనే పెళ్ళి చేశాడు. పెళ్ళయిన మరుచటి సంవత్సరమే టైఫాయిడ్ వచ్చి కొడుకు పోయినాడు. నిర్మలకు తన దగ్గర ఎక్కువ పరిచయం ఉండటం వల్ల ఆమె చదువుకోనే టందుకు పట్నం వచ్చి తన దగ్గ రనే ఉంటున్నది. అసలు ఆమెను చదివించు తున్నది కూడా తనే.

ఇదీ కథ — ఇంతా చెప్పి ఇంకా చెప్ప వలసింది ఉండి పోయిందన్నట్టే ముఖం పెట్టారు శాస్త్రిగారు.

క్షణం పోయినాక అతను తిరిగి అందుకొన్నా డిట్లా—

"అబ్బాయీ శంకరం! నిన్ను చూడగానే మళ్ళీ మా అబ్బాయి జ్ఞాపకం వచ్చాడు. చూడూ, నువ్వేమీ ముఖమాటం పడకు. అసలు మా ఇల్లు అద్దె కివ్వాలని నాకు అభిప్రాయమే లేదు. అయినా ఈ గది ఎవరికీ ఉపయోగం కాకుండా

ఉందని ఈ మధ్యనే అనుకొంటున్నాను అడ్రెకివ్వా లని. దేముడిలాగ నువ్వుదొరికావు. ఈఇల్లు నీఇల్లు గానే భావించుకొని మసులుకో, మరేమీ ఫరవా లేదు. నిన్ను ఇక్కడ దేనికీ అడ్డుపెట్టేవారు లేరు. నిర్మలఉన్నది. ఉత్త అమాయకపుపిల్ల—అన్నట్టు అదికూడా నీక్లాసే చదువుతున్నది. నువ్వు తెలివైన వాడల్లే అగుపిస్తున్నావు. దానికేమైనా సాయం చేస్తూఉండు. నీకేమయినా లోటు కలిగితే నాతో చెప్పు." అని వెళ్లిపోయినాడు.

శాస్త్రీగారిధోరణి శంకరానికి ప్రాణంపోసింది. అంతేకాదు—అతని కెంతో స్వేచ్ఛ ఇచ్చింది. కాని పక్కగదిలో నుంచే ఇదంతా వింటున్న నిర్మ లకు ఒక్కసారి అరికాలి మంట తల కెక్కింది.

శంకరాన్ని చూసిన దగ్గర్నుండీ-అందులో కాలేజీ కుర్రాడని తెలిసి నప్పటినుంచీ, అతనంటే ఆమెకు మా చెడ్డ కోపంగా ఉంది. ఆ కోపం కాలేజీకుర్రాళ్ళందరిమీదా ఆమె కుంటూఉన్న దే.

శంకరం దగ్గరలోనే ఉన్నాడు గనుక ఆ కోపం అంతా ఇతని మీద కేంద్రీకరింప బడింది. ఎందుచేత నంటే, ఆమె దృష్టిలో ఈ కాలేజీ కుర్రాళ్ళున్నారే—మా చెడ్డవాళ్ళున్నూ, పచ్చి రౌడీలున్నూ. ఆమె కాలేజీలో చేరి ఎంతో కాలం కాలేదు. మహా అవ్వుతే ఓ వారం అవుతుంది. అప్పుడే తన పక్క ఎంతో మంది వెధవ చూపులు విసరటం మొదలెట్టారు. ఇప్పటి వరకూ ఆమె దృష్టిలో శంకరం కూడా - అతనే పాపమూ ఎరక్కపోయినా—అటువంటివారి స్థానాన్నే ఆక్రమించుకుని ఉన్నాడు.

ఆగది అద్దెకివ్వటం నిర్మలకెంతో డిస్ట్రెస్ - అందుచేత, ఇంటి వాళ్ళెవరూ ఉండరు గనుక, తదితరులెవరూ కూడా అందులో ఉండటం ఆమె కిష్టంగా లేదు. అందులో ఆగదిని స్టూడెంట్లు పాలుచేయుటం ఆమెకు బొత్తిగా ఇష్టం లేదు. అయితే ఆ ఇల్లు తనది కాదామెను ? మా

మయ్య ఇష్టానికి అడ్డు చెప్పేటందుకు తెవరు ?

ఇంతకూ తన స్వభావం మంచిగా ఉంటే ఇంకెవరేం చేయగలరు ?

రెండు మూడు రోజుల్లోనే శంకరానికి కొంతమంది స్నేహితు లేర్పడ్డారు. చాలా మంది ఇతని నివాసం పట్టే స్నేహితులయినారని కూడా చెప్పవచ్చును. ఈ బృందం తరుచు రావటమే కాక, రాత్రిళ్ళు కూడా శంకరం గదిలో అడావుడి చేయటం మొదలు పెట్టారు. అయితే, ఇందులో శంకరం ప్రయత్నం ఏమీ ఉందనటానికి వీల్లేదు. తనతో చదువుకుంటున్న వారంతా తన రూముకు అట్లా వస్తూ ఉంటే నోరారా ఎట్లా రావద్దని చెప్పాలో అతనికి అర్థం కాలేదు.

ఈజట్టు నంతటినీ కనిపెడుతూన్న నిర్మల అగ్గయిపోతూ ఉండేది కూడా. మరి భరించలేక ఒకనాడు ఆబృందానికి వినపడేటట్టు కేక వేసింది.

" మామయ్యా ! ఆ అబ్బాయి అట్లా

గదిలో అంతమందినీ చేర్చే బాప తయితే వెంటనే గది ఖాళీ చెయ్యవలసి ఉంటుందని చెప్పాదూ"

ఆ సమచారానికి మామయ్య ఇంటో లేడని నిర్మలకే కాదు-శంకరానికి కూడా తెలుసు.

మర్నాటి నుండీ, తనే ఏమయినా పన్నాగం పన్నాడో, లేక ఆ బృందానికే ఏమయినా అర్థమయిందో కాని—శంకరం గదికి ఒక్కరూ కూడా రాలేదనే రూఢిగా చెప్పవచ్చును.

అయితే, ఇందుకు శంకరం ఏమనుకుని ఉండి ఉంటాడో అని, నిర్మల కొంతరూఢిచేసుకో లేక పోలేదు. తన ఆర్డర్ని పాలన కింద అంత వేగం శంకరం అమలులోనికి తెస్తాడని కూడా ఆమె ఊహించలేకపోయింది. క్రొత్తగా ఏర్పడిన ఈ పరిస్థితికి ఆమె కొంత చలించి, మర్నాడు క్లాసులో ఎవడేం కూత కూస్తాడో అని కూడా భయపడింది. కాని, అటువంటిదేమీ జరగకపోవటంచేత ఆమె ఆశ్చర్యం ఊహాతీతమయింది.

తనను చూస్తే నిర్మలకు చాలా కోపంగా మాత్రం ఉంటున్నదని శ్రీధరం గ్రహించాడే కాని, అందుకు నిజమైన కారణం ఏమయి ఉంటుందో తన ఊహకు ఎంత ప్రయత్నించినా తట్టింది కాదు.

నిర్మల మామయ్య చెప్పిన ప్రకారం తను పూర్తి స్వతంత్రుడుగా, ఆ ఇంట్లో ప్రవర్తించలేక పోయినా, అవసరాన్ని పట్టి నడుచుకుంటున్నాడు. ఇది కూడా నిర్మల కిష్టం లేదేమో అని జాగ్రత్తగానే ఉంటున్నాడు ఇటీవల.

నిర్మల విషయంలో అతని అభిప్రాయమల్లా ఒక్కటే—తన్ను చూస్తే నిర్మల నిప్పులు కక్కకుండా ఉండటం—అదే తను కోరేదన్నీ. ఏం చేస్తే అది సాధ్యమవుతుందో అని శక్తి ఉన్నంత వరకూ ప్రయత్నిస్తూనే ఉన్నాడు తను. స్నేహితులు తన గదికి రావటం నుండి ఎట్లానో తప్పించుకున్నాడు. ఇంట్లో జాగ్రత్తగానే ఉంటున్నాడు. ఆమె దృష్టిని కూడా సాధ్యమయినంత మట్టుకు

తప్పించుకుని తిరుగుతున్నాడు.

తనకు పైకి గట్టిగా చదువుకోవటం అల వాటు. నిర్మల అట్లా చదవటం లేదని గ్రహించాడు. తను గట్టిగా చదువుకుంటూ ఉండటం కూడా నిర్మల కిష్టం లేదేమో అని అది కూడా మాని లోలోనే చదువుకోవటం ప్రాక్టీస్ చేయసాగాడు.

శంకరం చాలా తెలివైనవాడనీ, తన క్లాసంతకూ పైచెయ్యే అని కూడా అనుకోనేటందుకు నిర్మల కెంతో కాలం పట్టలేదు.

శంకరం విషయంలో ఈ అభిప్రాయానికి వచ్చినప్పటినుండీ ఆపిల్లకు శంకరం పైన ఒక విధమైన ఇంటరస్టుకూడా కలిగిందనవచ్చును. తన వల్ల ఏమాత్రమో అపరాధం ఉందని సులభంగా తెలుసుకున్నది. అదీ కాక ఇప్పుడు శంకరం రోజూ చదువుకుంటున్నాడో లేదో కూడా తెలీదు!

ఇన్నాళ్ళూ పైకి వినపడేది. ఇప్పుడదన్నీ

లేదు. బహుశా తన ముఖాలాన్నే భయపడి చద వటం మానేశాడేమో అని దిగులు పడింది నిర్మల.

నోరుజారి ఏదన్నా అనేశాక, తను ఏమన్న దో గుర్తుకు తెచ్చుకుని తీరిగ్గా బాధపడే రకంలో నిర్మల చేరుతుంది. ఇలువంటి అనుభవాలు ఎన్ని సార్లయినా, తిరిగి ఈ పిల్లకు కొత్తే అవుతున్నది. ఆడుదేశ్రకంలో తను ఏమంటున్నదీ తెలియకపోవటం చేతనే తన మనస్తత్వం తనకు వ్యతిరేకంగా పని చెయ్యటం సాగిస్తున్నది. ఈ విషయంకూడా నిర్మ లకు తెలీదు!

## ౪

రాత్రి భోజనాలయినాక నిర్మల చదువుకో వాలని కూర్చున్నది తీరికగా. అదే సమయంలో రాము, గదిలోకివచ్చి, కొత్త పెన్సులు అదే పనిగా చెక్కటం మొదలుపెట్టాడు. ఎన్నిసార్లు చెక్కినా ముల్లు విరిగిపోతూ ఉండడంచేత మరి తనవల్లకాద నుకుని వొదిన దగ్గర చేరాడు.

"వొదినా! ఇది కాస్త చెక్కిపెట్టు_"

"ఛో—ఇప్పుడు నన్ను అల్లరిపెట్టకు" అని నిర్మల వినుక్కుంటూ నోటుబుక్కు పేజీలు తిరగ వెయ్యడం ప్రారంభించింది.

"మరేం వొద్దు- చిన్నిముల్లు వస్తేచాలు—"

అంటూ మారాం చెయ్యసాగాడు రాము.

"స్—స్సు—ఏమిటాగోల? చదువుకో నీక—మామయ్యతో చెప్తానుసుమా—"

అయితే అరుస్తాను - మావొదిన మాచెడ్డ

దగ్గొయ్ అని__మూవాది__"

అబ్బాయినోరు చప్పునమూసి విధిలేక పెన్సలు చెక్కటం ప్రారంభించింది నిర్మల.

" రాఘూ "

" ఓయ్ "

నిర్మల కాస్సేపుండి తిరిగి అన్నది—

" అతనెవరో నీకు తెలుసూ ?"

" ఎవరూ ?"

" ఈపక్కగదిలో ఉంటాడే అతను !"

" ఓ __ తెలీకేం ? "

" న్__కేక వేయకు__ఎవరు? "

" నీ క్లాసు మాటే కదూ ? "

" చప్__ఊరుకో. అతను వింటాడు. "

నిర్మల ఎందుచేత ఇట్లా తన్నడుగుతున్నదో ఆ పిల్లవాడికేమీ బోధపడలేదు. బహుశా నిర్మలకూ అర్థమయి ఉండదనే అనుకుంటాను.

పెన్సలుకుల్లుసూంది గా చేస్తూమళ్లీఅన్నదినిర్మల—

"ఒరే రాముా! అతను మా పెద్దవాడు కదురా?"

"చాప్ —ఎవరుచెప్పారట్లా? అతనెంతో మంచివాడు, నాకు ఆపిల్ పళ్ళిస్తూ ఉంటాడు."
"ఓరి భడవా! అప్పుడే అంత పరిచయం చేసుకున్నావూ?"

పరధ్యానంగా నిర్మల పెన్సలును సూదిపెడుతూ ఉండటంతో దానిముల్లు కాస్త విరిగింది.

"అదిగో మవ్వ్యా విరిచేశావు. ఇట్లాతే నీ చేతకాదిది."

అంటూ రాము పెన్సిలు లాక్కోపోయినాడు.

"అరె—ఉండు. ఈసారి బాగా చెక్కిపెడతాను." అని నిర్మల తిరిగి పెన్సలు చెక్క ప్రారంభించింది.

"రాముా!"

"ఓయ్!"

"అతనితో ఎప్పుడన్నా మాట్లాడావూ?"

"ఁవో—నిన్న —మొన్న కూడా — ఏం? నువ్వు మాట్లాడవూ ? "

"ఛీ—పరాయి మగవాళ్ళతో ఏ ఆడవాళ్ళన్నా మాట్టాడతారా ? "

ఎందుకు మాట్లాడరో- అసలుదీనికి జవాబు ఏమిటో కూడా రాము బుద్ధికి తట్టలేదు.

"ఏం? ఎందుకు మాట్టాడరాదూ? తంతారా ఏమిటి — మా మేష్టరిలాగ —"

"ఛీ — తప్పు — "

శంకరత్తోం మాట్టాడాలనీ, తనవల్ల తప్పేమయినా ఉంటే క్షమాపణ వేడుకోవాలనీ నిర్మల హృదయం ఎంత ఆరాటం పడుతున్నదీ సులభంగా గ్రహించవచ్చును.

ఇప్పుడు నిర్మలకు ఒక విధంగా శంకరమే లోకంగా ఉన్నట్టున్నది. రామును మధ్యవర్తిగా ఎప్పుడూ ఆ పిల్లవాడితో శంకరం గురించే మాట్టాడుతుంది.

ఈ విషయం ఏ మాత్రమో శంకరంకూడా గ్రహించకపో లేదనవచ్చును.

రాముతో నిర్మల, తన విషయమై మొట్ట మొదటనే మాట్లాడుతున్నప్పుడు తలుపు దగ్గరనే నిలపడి; కన్నంలోంచి అంతా చూస్తూ ఊపిరి బిగ పట్టి అంతా విన్నాడుకూడా.

అంతకు ముందు నిర్మల తన మనస్సులో ఏవిధమైన స్థానమున్నూ ఏర్పరచుకో లేదు.

అతనికి కలిగిన కోరికల్లా ఒక్కటే-తనపైన నిర్మల కోపం పోగొట్టాలని ... కాని నిర్మల తన గురించి అట్లా మాట్లాడినాక, తనపైన ఆపిల్ల కేవిధ మయిన కోపమున్నూ లేదనే స్థిరపరుచుకున్నాడు.

కాని, శంకరానికిటీవల మరో కొత్తకోరిక కూడా పుట్టుకొచ్చింది. అదేమిటంటే నిర్మలతో ఏదో విధంగా మాట్లాడాలని. మాట్లాడాలనే కోరిక తన కెందుక్కలిగిందా అని ఒకమూరు ఆలోచించ టానికి ప్రయత్నించాడే కాని, తనకు అంతేమో

దొరక్కపోవటంచేత, విసిగిపోయి, ఆ ఆలోచనే మానుకున్నాడు క్రమేపీ.

నిర్మలతో స్నేహంగా ఉండవలసిందనీ, ఆ పిల్లకు పాఠాలలో సాయంచేస్తూ ఉండవలసిందనీ, శాస్త్రిగారు తనతో చెప్పడమేకాదు—తనుకూడా అదేవిధంగా అనుకున్నాడు. కాని, ఆపిల్ల, తనకు రానురాను, ఈ విధమయిన రెస్పాన్సు ఇస్తుందని శంకరంఅనుకోలేదు. ఆలోచించగా, అతనికి నిర్మల ఒక విచిత్రమైన ప్రకృతిలాగ అగుపిస్తున్నది. కాని ఇందులో తన వీక్నెస్ కూడా కొంత ఉందనే జ్ఞానం శంకరానికి కలగలేదు.

౫

ఆవేళ శంకరం, తన క్లాసు అటాత్తుగా చిన్నపోయిందని గ్రహించి, నిర్మలకోసం వెతికాడు. కాని ఆమె కనిపించనే లేదు.

సాయంత్రం అయిదు గంటలకు వచ్చేవాడల్లా గంట ముందుగా వచ్చేశాడు తను. ముఖం కడుక్కుని, గదిలో ప్రవేశించి సరీగ్గా తల దువ్వుకుంటున్న సమయంలో పెరటి పిట్టడాబాపైన జుత్తు ఆరబోసుకుంటున్న నిర్మల కనిపించింది తన అద్దంలో. చప్పున వెనక్కు తిరిగాడు...నిదానించి ఆమెను చూడటం అతనికి దే మొదటిసారనవచ్చును.

నిర్మల ! ఎంత అందంగా కనపడుతున్నది ! తలంటి పోసుకున్న దేమో, తానింతవరకూ అంత పెద్దజుట్టును మరొకరికి చూసి ఎరగడు. నిర్మల చామన ఛాయగా ఉన్నది. అన్నింటికన్నా అతన్ని ఎక్కువ ఆకర్షించింది ఆమె పెద్దపెద్ద

లోతైనకళ్ళు. ఆ కళ్ళలోని దిగులంతా తన్ను పట్టి లాగుతున్నట్టే ఫీలయినాడు శంకరం.

అంతవరకూ ఆపిల్ల అవతలవేపు తిరిగిఉంది. అనుకోకుండా ఇటుతిరిగి ఒక్కసారి శంకరాన్ని చూసి, క్షణంవిస్తుపోయి, మరుక్షణంలో ముఖం చిట్లించుకున్నది.

తన్ను చూసి విస్మల ఆవిధమైన ముఖం పెట్టడం శంకరం హృదయానికి గాయం తగిలినట్లయింది. ఆనందకరమైన మూడ్స్‌లో ఉన్న అతని మనస్సు బాధపడ్డది. చివరకసహ్యంకూడా వేసింది. ఆసమయంలో ఎంతో చిన్నపోయినాడు కూడా.

తిరిగి కన్నెత్తి అయినా చూడకుండా ఆమె గిరున తిరిగి లోనికి వెళ్ళిపోవటంతో స్తబ్ధుడయిపోయినాడు శంకరం.

ఆ విధమయిన ప్రవర్తన నిజంగా తన్ను చూసేనా? లేక మరేమయినా కారణమా? అంతసేపూ ఎంతో అంత హాయిగా, ఆనందంగా,

అప్పుడే విడిన మల్లెపువ్వులాగ, డాబామీద ఉన్న ఆపిల్ల కాస్త, తనువచ్చేసరికి అట్లా ప్రవర్తించటంలో గల అర్థమేమిటి? అసలు తనవల్ల అపరాధం ఏమయి ఉంటుంది? లేక ఆపిల్ల భరించలేనంత అసహ్యంగా తనేమయినా అగుపిస్తున్నాడా? అదీ కాక, రాముతో మొన్న మొన్న తనవిషయమై, అంతరమ్యంగా ప్రస్తావించిన నిర్మలకు తిరిగి ఏం పూనింది? లేక, ఏమయినా కాస్త పిచ్చిగాని ఉందా? కొందరి స్త్రీల విపరీత మానసిక తత్వా లా విధంగా ఉంటవేమో! ఇవేవీకాక, తనవల్ల ఇటీవల ఏమైనా మళ్లీ తప్పు జరిగిందా?

ఈ ఆలోచనలతో శంకరం కాఫీ పుచ్చుకునే టందుకూ డా వెళ్లటం మరిచాడు.

ఆరాత్రి చిత్రమయిన విషయం జరిగింది.

నిర్మల రాముని పిల్చి తన విషయమే మాట్లాడుతున్నది. ఇది గ్రహించి తలుపుదగ్గర చెవిపెట్టి అంతా వినటం మొదలుపెట్టాడు శంకరం.

"ఒరే రామూ! ఈ గదిలో ఆయన నీకు మళ్లీ ఆపిల్ పండిచ్చాడా లేదా?"

రాము జవాబిచ్చాడు—

"నిన్న నే నడగలేదు. ఇవాళ ఇచ్చాడు."

"ఇవాళ నువ్వడిగావా?"

తడుముకోకుండా మళ్లీ జవాబిచ్చాడు రాము.

"అడగలేదు — అతను తింటూంటే నేను కనపడ్డాను. పిలిచి ఇచ్చాడు."

"ఏదీ?"

"తినేశాను"

"ఛీ — ఇంకెప్పుడూ అడక్కు —"

"అడగిందే?"

"పుచ్చుకోకు —"

"అతనిస్తే నే — ఎలామరి?"

ఇట్లా అని ఎందుకు పుచ్చుకోకూడదా అనే ఆలోచనపడ్డాడు రాము.

"వొద్దను." అంటూ నిర్మల కళ్లెర్ర జేసింది.

"ఏం ?"

రాముకు నిర్మలదగ్గర కాస్తంత భయంలేక పోలేదు. ఆపిల్లవాణ్ణి చిన్నతనంనుంచీ నిర్మల ఒక అదుపులో ఉంచుకున్నది. రామువిద్యకు చాలా మట్టుకు నిర్మలే కారణం. ఆ పిల్లవాడంటే నిర్మలకు తగని అభిమానం. అట్లా తన ఇష్టానుసారం రామునుతిప్పుకో గలుగుతున్నది నిర్మల.

"అతను మంచివాడుకాదు. ఆడాళ్ళకేసి అదేపనిగా చూస్తాడు. ఈ కాలేజీ కుర్రాళ్ళంతా ఇంతే, పచ్చిరౌడీజట్టు, అతనితో స్నేహంగాని చేస్తున్నావా ఏమిటి ?"

"ఆడాళ్ళ పక్క చూస్తే నేం ?"

ఈప్రశ్న రాము వెయ్యడం చాలా సబబుగానే ఉన్నది. మొదట్లో శంకరానికన్నా ఆ ముక్క వినగానే అదే సందేహం కలిగింది. కాని శంకరానికి చప్పున అర్థమయిపోయింది—తనచూపును నిర్మల చాలా తప్పుగా భావించుకున్నదని.

రాముకుమాత్రం నిర్మల జవాబు ఇవ్వక తప్పలేదు.

" ఛీ — అట్లా చూడరాదు. అది మంచి పనికాదు. "

" ఎందుకు మంచిపని కాదే? "

" నీ కెందుకూ? ఊరుకో — అతనితో కలియబోకు — చెడతావు. "

తన్నింత చెడ్డవాడుగా కట్టేసింది ఈనిర్మల! ఇదంతా, నిర్మలను తనట్లా చూడటం వల్లనేనా? ఇంతకూ నిర్మలను తను సరిగాచూసింది ఆసాయంత్రమే! దీనికేనా ఆమె ఇంత అసహ్యించు కుంటున్నది?

పైగా ఈ కాలేజీ కుర్రాళ్ళంతా 'పచ్చిరౌడీ' లా? తనూ కాలేజీ కుర్రాడే గనక రౌడీవేనా? మగవాళ్ల కాలేజీలలో చదివే ఆడవాళ్లుమాత్రం శుద్ధ పతివ్రతలా? ఎంత తప్పుడు అభిప్రాయా లున్నై ఈపిల్లకు కొన్నికొన్ని విషయాలలో!

రాముకు మాత్రం మరో పెద్ద సందేహం కలిగింది.

"ఏం వొదినా! నేన్నిన్ను చూడకూడదూ?"

ఈ ప్రశ్న కామె జవాబు చెప్పటంలో ఏమంత తడుముకోనూ లేదు. ఆలోచించనూ లేదు—

"నీకేం — నీవు చూడొచ్చు —"

రాముకి మళ్లీ ఏదో స్ఫురించి ఇట్లా అన్నాడు.

"మరేం — మా ఇస్మాయిల్ ఉన్నాడే— వాళ్లింటికి ఓసారి వెళితే, వాళ్ల అక్కయ్య గదిలో ఉంది. నన్నుకూడా ఆ వెధవ అటు వెళ్లనియ్యలేదు. ఏమని అడిగితే తప్పు అన్నాడు. నీఅంతే ఉంటుందే ఇస్మాయిల్ అక్క!"

నిర్మలకు కొద్దిగా పౌరుషం తలెత్తింది— "ఛి ఛీ— వాళ్లు తురకవాళ్లు. వాళ్ళకు ఘోషా. మనకేమిటి?" అన్నది— తన ప్రవర్తన మాటే మరచిపోయి.

ఈ సందేహాలూ సమాధానాలూ మధ్య

మునిగిన రాముకి ఎటువైపూ ఒడ్డు చిక్క లేదు.

ఉండుండి తిరిగి అన్నాడు రాము—

"అవుతే వొదినా? అతను నిన్ను చూస్తే నీ కెందుకూ కోపం?"

తనకు కలిగి ఉండిపోయిన సందేహమే ఈ పిల్లవాడికూ డా ఎట్లా కలిగిందా అని ఆలోచించుకొనడం మొదలు పెట్టాడు శంకరం.

"ఫో— నీ కెందుకూ ఆసంగతి? పోయి చదువుకో పో..." అంటూ కసిరింది నిర్మల.

రాముకి సందేహం అట్లానే ఉండిపోయింది.

"అతనితో చెపతాను—అత నంటే నీకు కోపమని—"

రాము రెక్క పట్టి లాగింది నిర్మల.

"మామయ్యతో చెప్పేస్తాను - నువ్వ లాంటి పనులు చేశావా అంటే_జాగ్రత్త-"

ఆ పిల్ల అట్లా అన్న దేకాని, మామయ్యకు శంకరం అంటే కాస్త అభిమానం ఉందని ఆమె

కేనాటి నుండో తెలుసు.

శంకరం గురించి మామయ్య తనకు కాస్త మంచిగానే చెప్పాడు. అప్పుడామె అన్నది,

" ఈ కాలేజీ కుర్రాళ్లు ఇట్లానే పైకి ఉంటారు మామయ్యా! కాని పచ్చి రౌడీలు- "

మామయ్య ఇట్లా సమాధాన మిచ్చాడు.

"ఛీ-ఊరుకో అమ్మాయ్! శంకరం ఇలాంటి వాడు కాదు, అతని ముఖమే చెప్తున్నది ఆ మాట. పక్కనేఉన్నాడని అతనితో నువ్వేమీ పోట్లాటలు తెచ్చుకోకు. "

ఈ సమాధానం ఆమె నప్పుడేమీ తృప్తి పరచలేక పోయింది. కాని, ఆమెహృదయం మాత్రం కాస్త ఆరాటపడింది___ మామయ్య తనవిషయంలో ఏమైనా అనుమానం పడతాడో ఏమో అని.

ఇంతవరకూ శంకరం చెవులు రిక్కించి నిర్మల మాటలు వింటూ ఉన్నాడు.

ఆమెకు తనపైన కోపంలేదని తా నిదివరకే

రాజీ చేసుకోవటం కేవలం పొరపాటు.

మర్నాటినుండీ శంకరం ప్రవర్తనలో తీవ్ర మైన మార్పొకటి వచ్చేసింది. దాదాపు, శంకరం తనరూముకే రావడం మానేశాడు.

కాలేజీలో మాత్రం శంకరాన్ని రోజూ చూస్తూనేఉంది నిర్మల. అయితే అతనెప్పుడు ఇం టికి వస్తున్నాడో సరిగా కనిపెట్ట లేకపోయింది. రమారమి క్వార్టర్లీ పరీక్షలయిపోయే వరకూ కూడా శంకరం నిర్మలకు అగుపడనే లేదని నిశ్చ యంగా చెప్పవచ్చును.

ఈ అగుపించక పోవడంలో నిర్మలకు ఆందో ళన హెచ్చిపోయింది. శంకరం ఇంటికి రాకపోటా నికి మూడోంతులుదాకా తనే కారణం. అతని ఈ కొత్త ప్రవర్తన ఆమె ఏ విధంగానూ తట్టుకో లేకుండా ఉంది. తన అభిప్రాయాన్ని ఎంత తెలి విగా గ్రహించాడు శంకరం! తప్పదు—తనవల్లే రావడం మానుకొని ఉంటాడు శంకరం... తనెంత

నీచుర్థాలు! పాపం, శంకరం ఎంతగా బాధపడి ఉంటాడో తనప్రవర్తనవల్ల! అతన్ని ఈసారి తప్పక కలుసుకుని ఏదో విధంగా క్షమాపణ కోరితే? కాని, ఆ వెంటనే నిర్మలకు మరో ఆలోచన తట్టింది. అసలు, శంకరం ఇట్లా రాకపోయేటందుకు తనప్రవర్తనే కారణం కాదేమో! మరేమైనా విశేషం ఉందేమో!

ఏమయినా, శంకరం, కాలేజీ కుర్రాళ్లందరిలాగ కాక, ఒక ప్రత్యేక సంస్కారమూ, మర్యాదా, ఉన్నవాడని మాత్రం నిశ్చయించుకున్నది నిర్మల.

## ౬

"నిర్మలా! నీక్లాస్ మేట్ కనపడటం లేదేమే?" అని అడిగారు శాస్త్రిగారు ఒకమారు.

ఆ ప్రశ్నకు జవాబివ్వటం ఏవిధంగానో వెంటనే నిర్మలకు స్ఫురించలేదు. ఎందుచేతనంటే కొన్నాళ్ళనుండి తనుకూడా అదే ఆలోచిస్తున్నది.

"ఏమో మామయ్యా! క్లాసుకు వస్తూనే ఉన్నాడాయన. ఇంటికి రావటం నేను కొన్నాళ్లబట్టే ఎరగను."

ఈ జవాబుతో కొంతవరకు కప్పదాటువేసి తప్పించుకున్నదినిర్మల. తిరిగి తనమీద మరోప్రశ్న పడకుండా ఉండాలని ఆపిల్ల అభిప్రాయం.

సరీగ్గా అదేసమయానికి శంకరం, ఎక్కణ్ణుంచో ఊడిపడ్డవాడల్లే వచ్చి మేడఎక్కబోతున్నాడు.

"ఏమోయ్! అబ్బాయ్! చాలాకాలమై నీ అలికిడే లేనట్టుందే! ఎక్కడుంటున్నావేమిటి?"

తక్కున శంకరం ఆగక తప్పిందికాదు. కాని ఆ సమయంలో నిర్మల అక్కడే ఉండటంబట్టి అతనికి ఆగాలని ఏ కోశానా ఇష్టం లేకపోయింది. అదీకాక, నిర్మలను చూస్తున్నకొద్దీ తనకు అసహ్యంగా కూడా ఉంటున్నది.

"ఎక్కడా లేదు— ఇక్కడే ఉంటున్నానండి. మిమ్మల్ని రోజూ చూస్తూనే ఉన్నాను —" అని జవాబిస్తూ మరక్కడ నిలబడక తన రూంకి వెళ్ళిపోయినాడు శంకరం.

నిర్మల ఈ మాటలు విని కొంత ఆందోళన పడింది. తననూ, తన మామనూ కూడా ఎట్లా తప్పించుకు తిరుగుతున్నాడా అనికూడా ఆమెకు ఆశ్చర్యం వెయ్యకపోలేదు. ఈ ఆలోచనే ఆపిల్ల హృదయానికి ఒక దెబ్బలాగ ఉంది.

శంకరం వెనకాలే తనమామయ్య కూడా మేడ ఎక్కాడు. నిర్మల తొందరగా పరుగెత్తింది తనదిగలోకి-ఏమయినా వాళ్ళ సంభాషణ వినపడు

తుందేమో ప్రయత్నించేటందుకు —

"ఏమోయ్! పరీక్ష లెట్లా ఉన్నై?"

"బాగానే ఉన్నాయండీ!"

"నువ్వు రోజూ ఇక్కడకు వస్తూనే ఉన్నావుకద?"

"రోజూ వస్తున్నానే! అయితే రాత్రి పడక్కే. పగలల్లా మా స్నేహితుడి ఇంట్లో గడుపుతున్నాను."

"ఏం? ఇక్కడ నీకేమన్నా డిస్టర్బెన్సుగా ఉంటున్నదేమిటి?"

ఆ ఇబ్బందేదో తనవల్లే నిర్మలకు కలుగుతున్నదని అనేసి, కొద్దిగా వేడి తగ్గించుకుందాం అనుకున్నాడు గాని, తీరా అందామని ప్రయత్నించే సరికి అది కాస్తా కంఠందాటి పైకి వచ్చిందే కాదు కంఠరానికి.

"అబ్బే లేదండీ. నేనూ మా స్నేహితుడూ కలిసి చదువుకొంటున్నాం—అంతే."

"ఏం ? మానిర్మల పోట్లాడిందా ఏమిటి?"

ఈ ప్రశ్న అవతల నిర్మలనూ ఇవతల శంక రాన్నీ కూడా ఒక్కమారు కలవరపెట్టిం దనవచ్చును. నిర్మల ప్రాణాలన్నీ పిడికిట్లో పెట్టుకుని వింటున్నది తన మామయ్య నోటంట ఇంకా ఎటువంటి మాటలొస్తాయో అని.

అసలు శాస్త్రిగారు వారిద్దరి గురించీ ఎటువంటి అభిప్రాయంలో ఉన్నారో బాగా ఊహించవచ్చును.

మొదట్నించీ అతననుకుంటూనే ఉన్నాడు వీ రిద్దరూ కలిసే చదువుకుంటున్నారని. అట్లా అనుకున్నాక అదేమంత మంచి పనికాదేమో అనే దురభిప్రాయం కూడా అతనికి పిసరైనా కలగలేదు. తను ఊహించిన దానికి కాస్త వ్యతిరేకంగా జరగటంచేత శాస్త్రిగారికి ఏమాత్రమో ఆశాభంగం అయింది. ఏదో ఊహించి అట్లానే జరుగుతున్న దని ఒక నిశ్చయానికి రావడమూ, దానిమీద నే

అతను ప్రశ్నలు వేయడమూ వింటూంటే నిర్మ
లకు వీకమొయ్యా కోపం వస్తున్నది.

శాస్త్రిగారి ప్రశ్నకు శంకరం జవాబిచ్చాడు-

" పోట్లాట ఎందుకండీ? ఆమె నాతో ఎన్న
డైనా మాట్లాడిన గుర్తుకూడా నాకు లేదు! "

దీనితో శంకరానికి కొంత హృదయ భారం
తీరింది.

తమ రహస్యం బయటపెట్టేస్తున్నాడే అని
నిర్మల హృదయం కొట్టుకోసాగింది. ఇంకా ఈ
శంకరం నోటంట ఏ మహావాక్యాలు పైకివస్తా
యో అని చెవులు రిక్కించి వింటున్నది నిర్మల.

" ఏమిటి? — ఏం సిగ్గుపడుతున్నావా
ఏమిటి? నీతో కలిసే చదువుకొంటున్నదనీ ఇంత
నిర్భయంగా అది పెద్దపరీక్షలో నెగ్గుకు రాగల
దనీ కూడా చెబుతున్నానే!" అంటూ ఆశ్చర్యం
వెలిబుచ్చాడు మామయ్య.

ఇదేమిటి? ఈ శంకరం సహాయముంటేనే

తను నగ్గగలిగినట్టున్నా, లేకుంటే లేనట్టూనా? శంకరం లేనప్పుడు మరి తనెలా నగ్గువొచ్చింది? మామయ్య ధోరణేమిటి అట్లా బోధపడకుండా ఉంది?

ఈ శాస్త్రిగారి ధోరణి బోధపడకపోవటం ఒక్క నిర్మలకే కాదు — అతని ధోరణీ సాధారణంగా ఎవరికీ బోధపడదు. ఈ ప్రపంచానికి అర్థం కాని మనుషుల్లో శాస్త్రిగారొకరు.

ఇందులో కొంత స్వార్థంకూడా ఉంది. అనుభూతికి వచ్చేవాటిలో శాస్త్రిగారికి ఆనందమిచ్చేవి చాలా ఉన్నై. అవి శాస్త్రిగారు సమయాను కూలంగా బయటపెడతారు. అవసరంలేకుంటే తనకు తానే వాటిని దాచుకొని లోలోన ఆనందిస్తాడు. తన ఆనందంకోసం తనకు దగ్గరగా ఉండే పరిస్థితుల్ని తన ఇష్టానుసారం వినియోగించుకుంటాడు కూడా. ఈ వినియోగించుకొనటంలో అతనికి నీచాభిప్రాయాలు లేవు. తోలుబొమ్మల్ని ఆడించి

నట్టే—ఆడించి తృప్తిపడతాడు. కాని ఈ ఆటలు ఇతరుల మనస్తత్వాల కెంతదెబ్బో అతనికి తెలీదు. తెలిస్తే ఈ పనులు చేసేవాడు కాదనే చెప్పవచ్చునుగాని, తెలుసుకునే జ్ఞానంకూడా అతనికి లేదు. అందరిమీదల్లే, శంకరంపైనా, నిర్మలపైనా, ఒక చిన్న ఆటే ఆడాలనుకున్నారు శాస్త్రిగారు. శంకరంగురించి శంకరానికీ, నిర్మలగురించి నిర్మలకూ ఎంతెంత తెలుసునో అంతకన్నా రెండాకు లెక్కువగానే వీరిద్దరి గురించిన్నీ శాస్త్రికి తెలుసును. ఈ తెలియటమే అతనికిమంచి అవకాశాన్ని ఇచ్చింది. సమయం వస్తేనే వీరిద్దరి గురించీ ఇగువురికిచెప్పి ఆనందించాలనే ఉద్దేశంలో ఉన్నారు శాస్త్రిగారు.

శాస్త్రి ఆవిధంగా తనధోరిణిలో ఎంతో సంస్కరణం చూపడం శంకరానికి మితిలేనిఆశ్చర్యం కలిగించింది. ఎందుచేతనంటే శాస్త్రిగారి విషయంలో తనట్లా ఇంతకుముందు భావించి ఉండలేదు. అదీకాక— ప్రమాదంవల్లనేనా తను నిర్మలతో

మాట్లాడుతున్నట్టు ఒకవేళ ఉపయోగించినా కొంప లంటుకుంటవేమో అనే భయంకూడా నేటితో పూర్తిగా తీరిపోయింది తనకు.

రమారమి నిర్మలకిప్పుడా ఇంతా అయింది- ఆపిల్ల ఒక విధంగా మామయ్యకు భయపడుతూ నేఉంది. తీరా శంకరంతో తను స్వేచ్ఛగా ఉండటం గాని తటస్థిస్తే, ఈ మామయ్య తన్ను నీచంగా భావించడా ? ఈ అభిప్రాయం నేటితో ఆమూలాగ్రంగా ఆమెలో నశించిందని నిశ్చయంగా చెప్ప వచ్చును.

అయితే, ఇదంతా తమకొక విధమయిన పరీక్షమాత్రం కాదు కద ? ఈ అనుమానం నిర్మల కెట్లా కలిగిందో అట్లానే నిలిచిపోయింది.

శాస్త్రిగారు తిరిగి ఈవిధగాం అన్నారు__

"ఇదేమిటిది? మంచివాడివే-నువ్వీ పక్కనే ఉండటం, మానిర్మలకు క్లాస్‌మేట్ అవటం, మీ ఇద్దరికీ ఇంతవరకూ పరిచయమన్నా లేకపోవటం,

నాకేం బాగా లేదుసుమా! శంకరం! చూశావూ? నేను పూర్వకాలపు మనిషి నేకాని-ఉద్దేశాలేమో మీవంటివారివే-సంస్కరణా, ఆదర్శమూ అంటే నాకు ఎంతో ఇష్టం కూడా. ఆ అభిప్రాయం తోనే, నేను నిర్మల నిట్లా దగ్గరుంచుకుని చదివిస్తున్నాను. అబ్బాయీ! ఇప్పటి కాలపు వాళ్ళు— మీకు సిగ్గులేదుటి?"

శాస్త్రిగారు పోతూ పోతూ ఇట్లా అనేసి వెళ్ళిపోయినాడు. ఏ విధంగా నయినా ఈ గండం గడిచి పోతే చాల్నని చూస్తున్న శంకరానికి శాస్త్రిగారు వెళ్ళిపోవటంతో కొండంత రిలీఫ్ కలిగినట్టయింది.

ఈ శాస్త్రిగారికి అసలు తనకూ నిర్మలకూ మధ్య జరుగుతున్న నిశ్శబ్ద ప్రతిఘర్షణలు ఏమీ తెలియవు. అయినా తా మిరువురూ అకారణంగా లోలోన ఏదో గొడవలు పెంచుకోవటం అట్లా ఉండగా, ఇంతవరకూ మాటవాసికైనా, మాట్లా

దుక్కోకపోవటం చాలా చిత్రమైన విషయమే!

ఇవాళ తను చేసుకున్న నిశ్చయమే వేరు! అసలు నిర్మలకు కనపడకుండా ఈ కలవలకు ఇంటికి చేరుకుందాం అనుకున్నాడు శంకరం—అంతే కాదు. ఈ సారి లాడ్జికూడా వేరే కుదుర్చుకున్నా డప్పుడే — తన స్నేహితుడి సాయంవల్ల. ఇప్పుడుచూస్తే ఈ శాస్త్రిగారి ధోరణివల్ల అన్నీ తారుమారు అయేటట్టున్నై. ఈ సందర్భంలో తను ఏ కారణంచెప్పి ఆ గది ఖాళీ చేయగలడు?

ఇదివరకు అతనికో కారణం, ఎవరో తనకు చెప్పినట్టు, స్ఫురించింది— 'నావల్ల మీా నిర్మలకు చాలా ఇబ్బంది కలుగుతున్నది' అని, గది విడిచే ముందు ధైర్యంగా శాస్త్రిగారితో చెప్పేద్దామని రూఢి చేసుకున్నాడు. కాని, ఇప్పుడీ శాస్త్రిగారికి అస లేవిషయమూ తెలిసినట్టు లేదే! పైగానిర్మలనూ తన్నూ కలిపేటందుకు కూడా ప్రయత్నంలో ఉంటున్నట్టున్నారే ఇతను!

తనుగాని ఆ గది విడచిపెట్టేస్తే ఏంకారణం చెప్పాలో తంతరానికి మరి తోచిందికాదు. ఏమయినా—ఇప్పుడు తలవలు- తిరిగివచ్చినాక మళ్లా అన్నీ ఆలోచించుకోవచ్చు—ఇప్పుడెందు తనవసరంగా ఈ చిలిపి సిల్లీ విషయాలతో బుర్రకాస్త పాడుచేసుకోవటం అనుకుని ఆరాత్రి స్వగ్రామం బయలుదేరటానికి నిశ్చయించుకున్నాడు తను.

## ౭

శంకరం తిరిగివచ్చి ఇక్కడ దిగడని శాస్త్రి గారికి ఏకోశానా అనుమానం కలగలేదు. అందుకు తగిన కారణం కూడా లేకపోలేదు...

శంకరం అడావుడి కనిపెట్టి శాస్త్రిగారిలా అన్నారు—

" ఏమోయ్! సామానంతా తీసుకుపోతున్నావే! మరిరావా ఏమిటి? "

చచ్చాన్రా దేముడా అనుకున్నాడు శంకరం.

" అబ్బే-రాకుంటే ఎట్లా అండీ? నేను-"

శంకరం మాటకు శాస్త్రిగారు ఠక్కున అడ్డువచ్చారు—

" మరేం ఫరవాలేదు. అంత సామానూ తీసుకెళ్లకు. నీకసలు విషయం ఏమీ తెలీదు. మీ నాన్నగారు నా కుత్తరం రాశారు. నేనూ అతనూ చాలా క్లోజ్ గా తిరిగేవారం చిన్నతనంలో. నీ

కిదంతా ఒకప్పుడయినా ఆశ్చర్యంగా ఉండటానికే ఇంతవరకూ నేను చెప్పలేదు."

నిజంగానే శంకరానికి ఆశ్చర్యంగా ఉంది. ఈశాస్త్రిగారి ప్రవర్తన తనకు చాలా పిక్యూలియర్ గా ఉన్నట్టు తోచింది. లేకుంటే, అంత పెద్ద వాడూ, ఇటువంటి విషయాలలో తనతో ప్లే చేయటం ఏమిటి ?

కనీసం తనతండ్రి అయినా తనకీ విషయం రాయలేదు. పోతే, వీళ్ళంతా కలిసి తన్నిలాగ పరీక్షించారా ఇట్లా ?

శంకరం ముఖంలోనిమార్పునంతా చప్పున కనిపెట్టారు శాస్త్రిగారు —

"మరేం లేదోయ్ — నీకిన్నాళ్లూ ఈవిషయం ఎందుచేత చెప్పలేదంటే - అసలు చెప్పేటంత అగత్యం ఏముందనీ ఇందులో—అందుకే ఈ ఇల్లు నీ ఇల్లుగా వాడుకోమని సూచించానా నాడు. పైగా, నీకు ఇదంతా మీనాన్నగారు రాసేఉంటా

రని కూడా నేను నీతో చెప్పటానికి అశ్రద్ధ చేశాను —"

నిర్మల తనగదిలో ఏదో పుస్తకం చదువు కుంటున్న దేగాని, రెండు చెవులూ ఈగదిలో సంభాషణలకు వప్పగించింది. చివరకు - శంకరం ఎవడో పై వాడు కాడనిమాత్రం నిర్ధారణ చేసుకున్నది.

ఇన్నాళ్లు తను శంకరాన్ని ఎంత పరాయి వాడుగా భావించింది! భావించటమే కాదు — ప్రయత్నపూర్వకంగా శంకరాన్ని తన దృష్టినుంచే తప్పించుకోవాలని చూసింది. ఇంత ఆందోళన శంక రం గురించి తను ఎందుకు పడుతున్నదో, కూడా నిర్మల తెలుసుకోలేక పోయింది.

శాస్త్రీగారు ఇంకా చెప్పటం ప్రారంభిం చారు శంకరంతో —

" అంతేకాదోయ్ —మా నిర్మలదికూడా మీ ఊరే. అమెతల్లిఒక్క తెఉంటున్నది మీఊళ్లో మీ అమ్మ బహుశా బాగాఎరుగును. మీ ఇంటికి

రం. డిళ్ళ అవతలనే వారిఇల్లు. నువ్వెరిగిఉండవులే-”

ఈ మరో కొత్త విషయంతో అవతల నిర్మ లా ఇవతల శంకరం ఒక్కమారు విస్తుపోయినారు.

“ అట్లానా ? ” అని శంకరం తన ఆశ్చ ర్యాన్ని పైకి కూడా ప్రకటించకుండా ఉండలేక పోయినాడు.

నిర్మల—కూర్చున్న చోటునుంచి లేచి, తెలుపుదగ్గరసా వచ్చింది మరింత కుతూహలంతో.

ఏమిటి—తన మామయ్య ఉండుండి, సీమ పటాకీలల్లే, ఒక్కొక్కసారి ఒక్కొక్క కొత్తవిష యాన్ని పేలుతున్నాడు ? ఇవన్నీ ఇదివరకే చెప్ప కుండా ఎందుకు కడుపులోనే దాచుకున్నాడూ ?

ఈ సందేహం, ఎంత ప్రయత్నించినా నిర్మ లకు తీరిందికాదు.

తన మామయ్యను తను బాగా ఎరుగును అని ఇంతవరకూ అనుకుంటూ ఉండటం కేవలం పొరపాటు ! ఇటువంటి వింత ప్రవర్తన కలవాడని

ఆమెకు నేటివరకూ తెలిసి వచ్చింది కాదు. చిత్ర మేమిటంటే, ఈ ప్రవర్తనలో అంత వింత ఏమీ లేదనీ, తెలిసి చేస్తూన్న చిన్నపేమాత్రం ఉందనీ ఆమె తెలుసుకోలేకపోయింది.

"చూడవోయ్—నువ్వు తొందర పడకు— మరొక్క రోజాగు. మా నిర్మలకూడా వస్తుంది. ఇద్దరూ కలిసే మీ ఊరు వెళుదురుగాని- ఆపిల్లకు తోడుగా కూడా ఉంటావు—''

అటాత్తుగా మామయ్య అట్లా అంటాడని నిర్మల ఊహించుకోలేదు! ఆ పిల్లకు ముచ్చెమటలు పోసినై.

శంకరమున్నా ఏమీ తక్కువ స్థితిలో లేకపోయినాడు. అతనికి నోట మాటే రాలేదు. శంకరానికి తడుతున్నదల్లా శాస్త్రిగారి ధోరణి అంతకంతకు మరింత వింతగా ఉంటూ ఉండటం.

ఈ ప్రవర్తనలో ఏదైనా అంతర్వ్యపయం ఉన్నదా అని శంకరం కాస్సేపు ఆలోచించక

షా లేదు. అతని ఊహాకు ఏదో లీలగా తట్టింది కూడాను. కాని అదే నిజం అనుకొనేటందు కెంత అవకాశం ఉందో, కాదనుకొనే టందుకూ కూడా అంతే అవకాశమూ ఉంది — దీని పర్యవసానం ఎట్లానో కూడా తెల్చుకోలేకపోయినాడు తను.

"ఇవాళే రమ్మనీ — ఇవాళే మంచిరోజనీ మా అమ్మ ఉత్తరం రాసిందండీ — లేకుంటే ఉండటానికేం?"

శంకరం తప్పించుకోవాలని చూశాడు గాని శాస్త్రిగారు ఛటాల్న అడ్డువచ్చారు.

"మరేం చెట్టు మునిగిపోవు లేవోయ్— ఇవాళకన్నా రేపు మరీ ఉత్తమమైన రోజు. రేపు సాయంత్రం బండిలో బయలుదేరుదురుగాని. అం- నువ్వు భోజనం చేశావా? ..."

"లేదు - ఇప్పుడు వెళతాను."

"వెళ్లకు. ఇక్కడే ఉండిపో. ఇకముందు కూడా నువ్వు హోటల్లో భోజనంచేస్తే నే నొప్పు

కోను. తెలిసిందా? లే_ మడికట్టుకో." అంటూ శాస్త్రిగారు మేడ దిగిపోయినారు.

గిరీశంగారి "డామిట్! కథ అడ్డంగా తిరిగింది" అన్నముక్క శంకరానికి వెంటనే జ్ఞాపకం వచ్చింది. పరిస్థితు లిట్లామారిపోతాయని క్షణం కిందట తను ఊహించుకో లేకపోయినాడు. కనీసం ఊహించటానికి తగిన ఆధారమైనా కనపడి తేకద!

అదీకాక — తను చదువుకునే టందుకు పట్నంవచ్చి, ఎవరింటోనో అద్దెకుంటే— చివరకు ఆ ఇంటివారికీ తనకూ ఇటువంటి దగ్గర సంబంధమే ఏర్పడుతుందనికూడా అతనికి తెలీదు.

నిర్మలకూ ఇదే ఆశ్చర్యంగా ఉంది. అద్దెకున్న కుర్రవాడికీ తమకూ ఇంత బాంధవ్యం అనుకోకుండా ఎట్లా అల్లుకుంది?

శంకరంతో ఒక్కతె వెళ్ళేటందుకు నాకు సిగ్గుగాఉంది అని మామయ్యతో చెపదామనుకున్నది నిర్మల. అందుకు శక్తిచాలకపోగా, ఏదో

వొంటో బాగా లేదంటూ తప్పుకోవాలని ప్రయ త్నిద్దా మనుకున్నది. కాని నమ్మదగిన ఆధారం ఏదీ కనపడలేదు. పైగా, మామయ్యతో ఈవిధం గా మాట్లాడితే చీవాట్లుకూడా పెడతాడేమో! అతని అభిప్రాయా లా విధంగా ఉన్నైమరి! అదీ కాక, ఇన్నాళ్లూ మాట్లాడుకోకపోవటంలో నీసం స్కారం ఏదీ అనీ, నువ్వు సాధించిందేమిటనీ, తిట్టేటట్టున్నాడు మామయ్య! కాని తనహృదయం ఎంత బలహీనతకు గురిఅయి ఉండిందీ తన కెంత తెలుసో మామయ్యకుకూడా అంతే తెలుసు.

మర్నాడు శాస్త్రిగారు శంకరాన్నీ, నిర్మ లను సాయంత్రం బండీకి దిగబెట్టి, ఇంటికి వచ్చి 'అమ్మయ్య' అని ఒక నిట్టూర్పుతో తన హృదయం లోని భారాన్ని తీర్చుకున్నట్టుగా ఫీలయినాడు.

# ౮

బండీ ఎక్కే-వరకూ తనూ, నిర్మలా మాట్లా డుకునే అవసరమే కలగకపోవటం మరీ విచిత్రం! ఉన్న కాస్త అవసరాన్నీ ఎట్లానో శాస్త్రిగారే తీర్చేతున్నారు- నాలు గయిదు సారులు వీరిద్దరికీ మాటలు కలిపిచూసి ఆనందింతామని శాస్త్రిగారు ఉబలాటపడి ___ నిరాశ చెందారు. ఎందుచేతనంటే నిర్మలకూ, శంకరానికీకూడా, కొత్తగా ఆవేశించి నట్టు, జంకుపట్టుకుంది. వాళ్లట్లా జంకటం సులభంగా కనిపెట్ట గలిగిన శాస్త్రిగారు, అందుకు హేతు వేమయి ఉంటుందో ఊహించలేక పోయి నారు. కానైతే, వారిద్దరికీ ఎప్పటికయినా పొసగ కుండా ఉండకపోదని అతనికి పూర్తి ధైర్యం ఉంది.

బండీ స్టేషను దాటింది- చాలాదూరంకూడా పోయింది. కాని, తమ ఇరువురినడుమా ఈ మూకీ వ్రతం ఇంకా ఎంతకాలం ఉంటుందో నిర్మలకు తెలిసి

నంతే శంకరానికిన్నీ తెలుసు. చిత్రమేమిటంటే — ఇద్దరికీ ఏమీాకూడా తెలియందల్లా అదే!

బండీ, వాళ్ల ఊరు చేరేసరికి రాత్రిసుమారు ఎనిమిదిన్నరా తొమ్మిదీ అవుతుంది. ఈలోగా ఆకలవుతే తినటానికని శాస్త్రిగారు ఉప్మా తయారు చేయించి, టిఫిన్ కారియర్ నిండా ఇచ్చారు— నిర్మల, ముందుసంగతిఆలోచించి వద్దనిఅంటున్నా. అదీకాక, స్టేషనులో ఒక బిస్కత్తుపొట్లాం, నాలుగు బత్తాయిపళ్లు, ఫ్లాస్కునిండా కాఫీ, కూడాకొని ఇచ్చారు శాస్త్రిగారు. అవన్నీ వీరిద్దరితో పాటు హాయిగా ఇంతవరకూ ప్రయాణంసాగిస్తూనే ఉన్నై.

శంకరంలోనూ, నిర్మలలోనూ ఏమార్పూ లేదింతవరకు- ఆకలిచేత ఇరువురి ముఖాలూ వాడి ఉండటంతప్ప. కాని, వారివెంట ప్రయాణంచేస్తున్న ఈ తినుబండారాలుమాత్రం, వాటిలో అవి మాట్లాడుకుంటూన్నట్టే ఉన్నై.

నేను చల్లారి పోయినాను అన్నది ఉప్మా.

నేను చీమలు పట్టిపోయినాను— రైల్లోకూడా నా
కీ బాధలు తప్పటంలేదు అన్నది బిస్కత్తులపొట్లాం.
కాఫీ వేడిగానేఉంది. బత్తాయిపళ్లు సజ్జవే. అందు
చేత అవి ఈమాటలు పెడచెవిని పెట్టినై.

పీటిపైన శంకరం కన్నా నిర్మలకు ఎక్కువ
అధికారం ఉన్నట్టు కనబడుతుంది. ఒకసారి పీటి
పక్క చూసి మాత్రం ఊరుకున్నది. ఆచూపుతో
ఆమెకు ఆకలి మరింతహెచ్చింది. కాని శంకరానికి
ఇవ్వకుండా ఎట్లా తినగలదు ? శంకరానికి ఎట్లా
ఇవ్వటం ?

ఈ సంఘటన చాలా విచిత్ర మయినదీ,
విపరీతమయినదీ, విడ్డూర మయినదీనూ! తామిరు
వురూ ఇంత విచిత్రంగా ప్రవర్తిస్తూ ఎందుకిట్లా బాధ
పడు తున్నారో ఇరువురులోను ఒక్కరికి కూడా
తెలీదు.

అంతవరకూ తమకుతోడుగా ఇద్దరు స్త్రీలూ,
ముగ్గురుపురుషులూ కూడా ప్రయాణం చేస్తూనే

ఉన్నారు. ఒక స్టేషనులో వీరంతా దిగిపోయినారు కాని, ఆస్టేషనే, నడివయసు దాటిన దంపతులనూ ఇద్దరు కుర్రవాళ్లనూ, మరో పడుచు భార్యాభర్తా ఇరువురు చంటిపిల్లలూ, ఇంతమందిని వీరికి తోడుగా ప్రసాదించింది.

కిటికీనుండి తలదూర్చి నిర్మల స్టేషనువైపు చూస్తున్నది. శంకరం మాత్రం తమబండిలో ఎక్కుతున్న ఇంతమందినీ చూస్తూనే ఉన్నాడు — తన ఆలోచనలు ఇక్కడలేకున్నప్పటికీ.

వయస్సుమీరిన దంపతులు తమకెదురు బెంచీమీదకూర్చున్నారు. భార్య ఇద్దరి స్థలం ఆక్రమింకున్నట్టుగా కనబడుతున్నది. భర్త ఒక్కమనిషి స్థలానికే ఎక్కువయిపోనాడు.

"చూడండీ—చిలకా గోరింకల్లాగా—మన అబ్బాయిలాగనే ఉన్నాడీ కుర్రవాడు. పిల్లను చూస్తే కోడలిని చూసినట్టేఉంది. ఎట్లాఉన్నారో కుర్రనాగన్నలిద్దరూనూ ఆ అడివి అగాంతరాల్లో,

భార్యా భర్తా అంటే ఇట్లు ఉండాలిగాని..."

ఆవిడట్లా ఇంకాఏమో గొణుగుతున్నది. ఆమాటలన్నీ వింటూఉన్న శంకరానికీ, నిర్మలకూ వారిఆలోచనలు ఇట్టేఎగిరిపోయినై. ఇద్దరూ ఒకరి మొఖం ఒకరు అప్రియత్నముగా చూసుకొని సిగ్గుపడ్డారు.

"అబ్బాయీ! మన్దే ఊరు?"

చప్పున శంకరం నోరు పెగలలేదు- ఏమీ తోచక దిక్కులుమాత్రం చూడగలుగు తున్నాడు.

"ఏమమ్మాయీ! ఎక్కణ్ణించివస్తున్నారు! ఎక్కడికి? అత్తవారింటి కెళుతున్నావా?"

ఈ చిత్రిప్రశ్నలన్నీ ఆవిడ కెందుకో శంకరానికీ నిర్మలకూ కూడా అర్ధంకాలేదు. పైగా ఆవిడట్లా ఎందుకడగాలి అని కోపంవచ్చింది. లోలోన ఆవిణ్ణి దీవించికూడా ఉంటారు.

నిర్మల ఎట్లానో ఆవిణ్ణి సమాధానపరిచింది. శంకరానికి సంఘటనే చాలా ఘోరంఅనిపించింది.

ఒక్కొక్క విషయంలో లోకం ఎంత విచిత్రంగా భావిస్తుంది! భావించటమే కాదు. తన ఊహాలు రూఢిపరిచేసుకుంటుంది కూడా. తననూ నిర్మలనూ తోబుట్టువులుగా ఎందుకు భావించదూ? తమ ఇరువురికీ ఎటువంటి సంబంధమే ఉందో తెలీని లోకానికి తమను భార్యాభర్తలుగా ఊహించేటం దాకున్నంత అవకాశమూ మరోవిధంగా ఊహించేటందుకున్నా ఉన్నది. అవుతే ఏం? ఆ పరిస్థితిలో నిర్మలనూతననూ భార్యా భర్తా అనే అంటుంది.

నిర్మల తన భార్య కాదు, స్నేహితురాలు అని ఆవిడకు చెప్పేస్తే? కాని ఆ చెప్పేవిధం ఎట్లా?

తమ ఊరు దగ్గరపడుతున్న కొద్దీ, ఇరువురికీ గుండె తీవ్రంగా కొట్టుకోవటం ప్రారంభించింది. ఇంత అయినాకకూడా, ఇంతవరకూ ఎట్లామాట్లాడుకోకుండా కూర్చున్నారు? ఇంతవిచిత్రమైన వ్యక్తులు ప్రపంచంలోనే ఉంటారా? ఇంత వరకూ ఒకరినొకరు పలకరించుకోకుండా ఏం సాధిస్తున్నారో వారికే తెలీదు. చిత్రమేమిటంటే-ఎవరుముందుగా

ఉపక్రమించాలో, ఎవరికీ దమ్ము చాలటంలేదు.

బండీ, వాళ్ల ఊరు చేరేసరికి రాత్రితొమ్మిది అయింది. శంకరం గుండె ఆగినట్టే అయింది. ఒక విధమైన వొణుకుతో అట్లానే దిగాడు. వెనకాలే నిర్మల కూడా దిగింది. కూలీవాడిచేత సామానులు దింపించాడు శంకరం. టిక్కెట్లుకూడా ఇచ్చేసి, పైకి సామానుతో సహావచ్చారు ఇద్దరూనూ !

చిత్రం ! పలకరించుకోవలసిన అవకాశాల్ని ఎంత విచిత్రంగా దుర్వినియోగపరుస్తున్నారు !

బండివాడు శంకరానికి పరిచయస్తుడు. ఈ పరిచయం ఇప్పుడు శంకరాన్ని ఎంతో రక్షించింది. నిర్మలను మాత్రం బండివాడు పోల్చుకోలేకపోయి నాడు. ఆమెనిదివరకెక్కడా చూసిన గుర్తయినా వాడికి లేదు.

నిర్మలగురించి ఈ వెధవ బండివాడు తనను వుటిక్కున ఏమయినా అడిగేస్తే, ఏమని జవాబు చెప్పాలి? ఇదొక విచిత్రమయిన ఎడ్వెంచర్ ! పుస్త

కాల్లో ఎన్నో చదివాడుగాని ఇటువంటి ఎడ్వెంచర్ ఎన్నడూ చదవలేదు శంకరం.

ఇద్దరూ బండీ ఎక్కారు. నిజంగా ఒకరి కొకరు తగిపోయినారు!

"బాబూ...అమ్మగారు...—"

బండివాడి మాటకు మాత్రం చప్పున అడ్డు వచ్చాడు శంకరం—

"ఊ...పద...ఇంటికే..."

నిర్మల కెందుచేతో, అంతనీరసస్థితిలోనూ అవుకోలేనినవ్వు వచ్చింది. ఆనవ్వును పైకిరానియ్యకుండా తొక్కిపట్టటంలో ఆమె దేహంలో ప్రతి అణువులోనూ ఉన్న నిగ్రహాశక్తినంతా ఉపయోగించింది.

బండివాడు తిరిగి మాటాడలేదు. వాడికిన్నీ ఏమీ అర్థంకాక నిర్మలను అదోమోస్తరుగాచూసి బండితోలటం లంకించాడు.

సరీగ్గా శంకరం ఇంటిముందే బండిఆగింది.

"అమ్మా !"

పార్వతమ్మ అప్పుడే తలుపు వేసుకొంటు న్నది. కొడుకు కేకవిని లాంతరు పట్టుకుని పైకి వచ్చింది.

" ఏం రా నాయనా ! వచ్చావా ? నాన్న గారు నీ కోసం నిన్న ఎదురు చూసి చూసి ఇవాళ పొద్దుటే పొలంమీదికి వెళ్ళారు. ఎవరున్నారు బండిలో ఇంకా ?"

పార్వతమ్మ ఇట్లా మాట్లాడేస్తూనే బండి దగ్గరకొచ్చి తొంగిచూసింది.

" ఎవరాొ ఈ అమ్మాయీ ?..."

శంకరం కాళ్లు వణికినై. మరుక్షణంలో అతనక్కడ లేడు.

" ఎవరమ్మా నువ్వు ? నువ్వు-నువ్వు- నిర్మల కావుటే ? అదుగో...ఇద్దరూ కలిసే వచ్చారూ ? ఎంతలో ఎదిగావే తల్లీ ! చాలా పెద్దదానివయి నావే ! నేనుజ్ఞాపకం ఉన్నానే తల్లీ ? ఎంతకాల

మయిందే పిల్లా నిన్ను చూసి! మీ ఇద్దరికీ ఎట్లా కలిసిందే?"

పార్వతమ్మ గుక్క-తిప్పుకోకుండా ప్రేమాభిమానాలు ఉట్టిపడేటట్టు మాటలు కురిపించేస్తున్నది.

నిర్మల సిగ్గుతో మాట్లాడలేక పోయింది. అదీకాక, ఈ విచిత్ర సంఘటనలచేత ఆమె ఇప్పటికే ఊహాతీతమైన పరిస్థితిలో ఉంది.

నిర్మల సిగ్గుపడుతున్నదని కనిపెట్టింది పార్వతమ్మ.

"రేపురావే తల్లీ! ఒరే అబ్బీ! అల్లా మూడోగుమ్మం ఇంటో ఈపిల్లను దిగబెట్టు-" అని చెప్పి పంపింది.

కాస్త తడుముకోగా, నిర్మలకిప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఈవిడ ఎవరో!

ఆమె ఇంటిముందు దిగగానే బండిచప్పుడుకి తల్లి వచ్చి తలుపుతీసి కూతుర్ని చూసి విస్తు

పోయిందిం

" ఏమే తల్లీ! ఒక్కతెవే వచ్చావు-ఎట్టా వచ్చావే? ఉత్తరమేనా లేదు - అయ్యయ్యో-తో డైనా లేక ఎట్లావచ్చావే!" అంటూ కూతుర్ని కావలించుకున్నది.

బండివాడు సామాను లోన పెట్టి,

" అద్దె అబ్బాయిగా రిచ్చారమ్మా!" అని చెపుతూ వెళ్లిపోయాడు.

"వాళ్ళఅబ్బాయీ నేనూ కలిసివచ్చాం!"

ఒక ఘనమైన కార్యం చేసినట్టుగా నిర్మల ఆమాటలన్నది. ఆమెకిప్పుడు పోయినప్రాణాలన్నీ తనలో ప్రవేశించినట్టే ఫీలయింది. ఇంతసేపటికి నోరిప్పి మాటాడగలిగింది!

" ఎవరబ్బాయే?"

" అల్ల —అ—మూడో ఇల్లు-"

నిర్మల పార్వతమ్మ పేరు మరిచిపోయింది. కాని ఫలానాఅని మాత్రము జ్ఞాపకం ఉంది.

" ఎవరూ! పార్వతమ్మ!"

"-అఁ అఁ! అవునే!- వాళ్ళఅబ్బాయి!

౬

నిర్మల పట్నంలో జరిగిన కథఅంతా సవిస్తరంగా తల్లితో చెప్పింది. మామయ్య శంకరాన్నెట్లా ఆదరించాడో కూడా చెప్పింది. కాని, శంకరానికీ తనకూ ఎంత మట్టుకుపరిచయముండున్నదీ మాత్రం, ఒక్కరవ్వైనా చెప్పకుండా జాగ్రత్తపడింది.

కూతురిమాటలకు చెవులట్లావప్పగించి వింటూ వింటూ అప్రయత్నంగా నిర్మలతల్లి కంటనీరు పెట్టింది. తల్లిప్రవర్తన నిర్మలకేమీ అర్థంకాలేదు. తల్లిని ప్రశ్నించటానిక్కూడా ధైర్యంలేక, నిర్మల అట్లా తల్లిముఖమే చూస్తూ ఉండిపోయింది.

నిర్మల తల్లికీ శంకరంతల్లికీ బంధుత్వం ఏమీ లేకపోయినా, ఇరుగుపొరుగు స్నేహం ఎక్కువగా ఉండింది. ఆ స్నేహం_ఇరువురూ ఒకనాడు మాటమీదమాటవచ్చి పోట్లాడుకునే పర్యంతం పెరిగింది. అప్పటనుండీ తిరిగి వారిద్దరూ నేటివరకూ స్నేహం

గా మాట్లాడుకుని ఎరగరు. పార్వతమ్మకు నిర్మల అంటే ఒకవిధమయిన అభిమానం ఏర్పడిఉండేది. కాని, నిర్మలకు చిన్నతనంలోనే వివాహం అవటం చేతనూ, అయినవెంటనే భర్తృవిహీన కావటం చేతనూ, ఆ కారణంగా మేనమామ, నిర్మలను దాదాపు ఇంతవరకూ తనదగ్గరే ఉంచుకుంటూ చదివించటం చేతనూ, ఇన్నాళ్ళు నిర్మల తన కళ్ళ కృ-నపడటానికి అవకాశంఅంటూ ఏర్పడిందికాదు. ఇప్పటివరకూ నిర్మల తల్లే పట్నంపోయి కూతుర్ని చూసి వస్తూ ఉండేది. నిర్మల రావటం ఆరేళ్ళ తరువాత ఇదే మొదటిసారి ...

పార్వతమ్మా తనూ ఎంత స్నేహంగా ఉండే వారు! అటువంటిది......తనమూలాన్నే తప్పంతాను...ఏదో మాటకుమాటగా_మర్నాటినుండీ తనే మాటలు మానేసింది. ఆ తర్వాత పార్వతమ్మ ఓసారి తన ఇంటికి వస్తే తిన్నగా పలకరించనైనా లేదు.

తప్పంతా తన దేననీ, ఈ తను నిలిపిపోట్లా టలో అర్థంపమీ లేదనీ, నలుగురు విని చీవాట్లు కూడా పెట్టేటటువంటి దనీ, ఆమె గ్రహించి, మర్నాడే పార్వతమ్మను చూడటానికి నిశ్చయించుకున్నది. వారిపోట్లాటగురించిగానీ, పార్వతమ్మకూ తనకూ మాటలు లేవనిగానీ, పట్నంనుంచి వచ్చిన కూతురితో చెపితే, ఆమెవల్ల చీవాట్లుతినాలో ఏమో అని భయపడి, అసలా విషయమే ఎత్తుకోవటం మానేసింది.

చిత్రమేమిటంటే, కూతురువచ్చి, శంకరం గురించిచెప్పేవరకూ నిర్మలతల్లికి పార్వతమ్మతో రాజీపడేవిషయమే గుర్తుకురాలేదు. తను చేసిన స్వల్పమైన తప్పుకి పశ్చాత్తాపంకూడా తన కిప్పుడే కలిగింది. కూతురి మాటలతో ఆమెకు పూర్వపు సంగతులన్నీ ఒక్కసారి జ్ఞాపకం వచ్చినై. వాటిని భరించలేని పశ్చాత్తాపం ఆమె గుండెను నీరు చేసింది. ఇంత జరిగితేనేగాని ఆమె తన్ను తాను

తెలుసుకో లేకపోయింది.

ఆ రాత్రి యావత్తూ అక్కడ శంకరానికీ, ఇక్కడ నిర్మలకూ, ఒకవిధంగా అసలువిద్రపట్టనే లేదనిచెప్పవచ్చును. ఇరువురూ ఆరాత్రి ప్రపంచములో ఉండే సర్వవిషయాలూ మరచిపోయినారు. చిత్రమేమిటంటే ఇరువురు ఆలోచిస్తున్నదీ ఒక్క విషయంగురించే !

తమకు అనుభూతమైన ఆచిత్రమైన సంఘటన గురించి దీర్ఘాలోచనతప్పితే, ఆ రాత్రి మరొక ఆలోచనతో వారికి సంబంధమే లేకపోయింది.

ఒకరితో ఒకరు పలకరించుకోటానికీ, మాట్లాడుకోటానికీ కలిసివచ్చిన సమయమంతా ఎంత విచిత్రంగా వృధాపోయింది ! ఇరువురి హృదయాలనూ ఒకేవిధమైన బలహీనత ఆక్రమించుకున్నది. ఇందుకేదైనా ప్రబలమయిన కారణం ఉంటుందా? ఇందులో ఒకరికొకరు చేసుకున్న అపకారంపేదన్నా ఉందా ? ఇట్లా మూగిగా ఒకరి నొకరు అనుసరించి

స్వగ్రామం చేరుకోవలసి ఉంటుందనీ, ఇటువంటి అపూర్వ సంఘటన అనేదే ఒకటి తమ జీవితంలో ఏర్పడుతుందనీ, ఊహించుకోటానికైనా వీలు లేని విషయము ఇది !

శంకరానికీ నిర్మలకూ చిన్నతనంలో ఎక్కువ పరిచయం అంటూ ఉండేటందుకు ఏమీ అవకాశాలు లేకపోయినై. ఉన్న కాస్త పరిచయమూ జ్ఞాపకం పెట్టుకోనేటంత వీలుగా కూడా లేదు.

"మువ్వా ఆపిల్లా చిన్నతనంలో కలిసి చాలా అల్లరిచేసేవాడు." అని తల్లిచెపితే శంకరం విస్తుపోయి వినడం తప్ప చేసేది లేకపోయింది.

అదీకాక, మేనమామ దగ్గరే విశేష కాలం పెరిగిన నిర్మలకు స్వస్థలం తాలూకు విషయాలు జ్ఞాపకం పెట్టుకోనేటందుకు తగిన ఇంటరస్టు కూడా లేకపోయింది.

న్యాయంగా జరగవలసిందేమిటంటే, చిన్నతనంనుండీ ఇరుగుపొరుగువారైన నిర్మలా శంకరం కూడా కాస్తో కాస్తయినా పరిచయయంగా

ఉంటూ ఒకరికొకరు కొత్తగా లేకుండా ఉండవల సింది. ఇదే నిజమయిఉంటే వీరిమనస్తత్వాలు ఇంత విపరీత పరిణామాలకు రాకనేపోను. శంకరం చిన్న ప్పటినుంచీ తన గోలేదో తను చూసుకోనటమే తప్ప, అతనికి చెప్పుకోతగ్గ పరియస్థులన్నా లేరు. చిన్నతనంలోనే పొరుగుపిల్ల నిర్మలతో స్నేహం చెయ్యటం, చాలామంది లాగా, అర్థం లేకుండా ప్రేమలోదిగటం, అతనికి చాతకాలేదు. ఆపిల్ల మీాద దాదాపు అతనికి తగినంత దృష్టే లేక పోయింది.

మర్నాడు పొద్దటే, ఏశక్తి వచ్చి నిర్మల తల్లిలో ప్రవేశించిందో చెప్పలేనుకాని– కూతుర్ని వెంటపెట్టుకుని పార్వతమ్మ ఇంటికి బయలుదేరింది.

నిర్మల తల్లిలో ఇటువంటి మార్పురావటా నికి ఒకకారణం నాకు కనబడుతున్నది. పార్వతమ్మ కాలూకు ఏమంచితనమో, తనకూతురికి శంకరం సహాయకారిగా ఉంటూ వచ్చిన పరివర్తనలో

ఆమెకు కనబడిఉంటుంది. శంకరం, నిర్మల కలసి రావటం, తెగిపోయిన తమపరిచయం అతుక్కునే టందుకు ఎంత అవకాశం ఇచ్చింది!

పార్వతమ్మ ఇంటికి బయలు దేరటానికిముందు, 'నేనుంటాను, నువ్వువెళ్ళిరా' అని తల్లితో అందా మనుకొన్నది నిర్మల. కాని, తనింటో ఉండిపో టానికి తగినకారణం ఏదీ? తనూ శంకరం ఇంత వరకూ మాట్లాడుకొనైనాలేదనే నిజాన్ని తల్లి ఎదుట బైటపెట్టేటందుకూడా ఆపిల్లకు నోరు రాక, విధిలేక తల్లి ననుసరించింది.

తల్లికూతుళ్లు ఇద్దరూ పార్వతమ్మ ఇంటో కాలుపెట్టే సమయానికి శంకరం పెరట్లో ముఖం కడుక్కొని వస్తూ తనగదిలోనికి పోతున్నాడు. నిర్మలను చూసి మరీతొందరగా లోనికి వెళ్లిపో యినాడు.

నిర్మల తల్లీ, పార్వతమ్మా ఎంతో పరిచ యంగా పూర్వవృత్తాంతాలతోనే పలకరించుకున్నా

రేగాని, అందులో జీరగానీ, కొత్తదనంగానీ, ఒకరి కొకరు ఏమీ కనబరచుకోలేదు.

పార్వతమ్మ నిర్మలను చూసి తన ప్రేమం తా ఉట్టిపడేటట్టు ఒకసారి కౌగిలించుకొన్నది. ఆ పిల్ల స్పర్శతో పార్వతమ్మ కళ్ల వెంట నీళ్లు కారినై. వాటిని చాటుగా తుడుచుకొని, నిర్మలచేత కప్పు కాఫీ తాగించింది, పుచ్చుకొని వచ్చానని ఆ పిల్ల అంటున్నా. మరోకప్పు అందించింది—

"ఇంద — నీ స్నేహితుడు కనిపెట్టుకొని ఉన్నాడు. ఈ కాఫీ ఇచ్చిరా." అన్నది.

నిర్మల ముఖాన కత్తివేస్తే నెత్తురు లేదు. అనుకోకుండా ఎంతవిపరీతం సంభవించింది! నేను ఇవ్వలేననీ ఇవ్వననీ ఎట్లాఅనగలదు? తనకూ శంక రానికీ ఎంతఎక్కువ స్నేహంఉందని, పార్వతమ్మ ఊహిస్తున్నదో ఇప్పుడర్థమయింది నిర్మలకు. ఇటు వంటివి జరుగుతవని ముందుగా ఆలోచించుకొని ఉంటే, తనే ఏదోవిధంగా శంకరంతో రాజీకివచ్చి

ఇదివరకే మాట్లాడి ఉండునేమో! కాని, అటు వంటి ఆలోచనయినా కలిగిందికాదు కద తనకు! ఎంత అజ్ఞానవంతురాలు!

కప్పు చేత్తో పట్టుకుని ఆమె అట్లా నేలను చూస్తూ ఉండటం గ్రహించి తల్లి అన్నది —

"వెళ్ళమ్మా! పోయి ఇచ్చిరా!"

తల్లికూడా ఇట్లా పార్వతమ్మమాటను ఆమో దించి నందుకు ఆమె కాస్త వొణికింది. ఇంక వెళ్ళక తప్పదు. ఎంత విచిత్రమయిన అగ్నిపరీక్ష తనకు!

నిర్మల కప్పు చేత పట్టుకొని తడబడుతూ గదిలోనికి వెళ్లింది.

గదిలోనుంచి శంకరం ఈపైన జరుగుతున్న దంతా ఒకపక్క తలుపు వారనుండి చూస్తూ విం టూనే ఉన్నాడు. తన గదిలోనికి నిర్మల వస్తున్న దని తెలియగానే భటుక్కున అద్దంవైపు తిరిగి క్రాపు దువ్వుకొనటం ప్రారంభించాడు ఏమీ ఎరు గని వాడల్లే.

కాఫీకప్పును టేబిలుమీద పెట్టి అట్లా ఏం చెయ్యటానికీ తోచక నిర్మల తుణం నిలబడింది. అద్దంలోంచి చూస్తూ చూడనట్టుగా శంకరం నిర్మలను పరీక్షిస్తూనే ఉన్నాడు.

ఆమె వెళ్లిపోవటానికి సంసిద్ధురాలవుతూ ఉందని తెలుసుకోవటంతో శంకరానికి ఎక్కడా ఎన్నడూ లేనంత ధైర్యం ఒక్కసారి వచ్చింది.

తనధైర్యాన్నంతా చిక్కబట్టుకుని—

" మా—ట " అన్నాడు.

ఆ ఒక్కమాట ఉపక్రమణగా అనటానికి తన హృదయదౌర్బల్యంతో ఎంతో తీవ్రంగానే శంకరం పోట్లాడి ఉంటాడు.

ఆ ఒక్కమాటకు నిర్మల ఒకవిధంగా మంత్రముగ్ధ అయింది. ముందుకు పడుతున్న అడుగు అట్లానే ఉండిపోయింది.

ఆమె తలవంచి ఓరగా శంకరాన్ని పరీక్షిస్తూ నిలవడింది. ఒక్కసారిగా శంకరం ఎంతో

మామూలుగా నవ్వటానికి ప్రయత్నిస్తూ —

" నామీద అంత ఆగ్రహం ఎందుకూ ! "

అన్నాడు.

ఆమాటమాత్రం మామూలుమనిషల్లే నే అనగలిగాడు. ఆమాటతో నే నిర్మలకు జీవం కూడా వచ్చిందను కుంటాను. ఆమె ఒకమారు తలఎత్తి ఆశ్చర్యంగా శంకరాన్ని చూసింది. అంతే కాదు— తనకేసి తిరిగి ఎంతోపరిచయస్థుడల్లే నే తలదువ్వకుంటూ నవ్వతున్న శంకరాన్ని చూసే సరికి నిర్మల నవ్వకుండా ఉండలేకపోయింది. పైట చాటుగా ఎట్లానో నవ్వాపు నేటంకుకు ప్రయత్నం చేస్తూ ఎదురుగా అద్దంలో కనబడుతున్న శంకరం ప్రతిబింబం పరీక్షిస్తున్నది.

శంకరం గంభీరంగా ముఖంపెట్టి—

"మనం ఇన్నాళ్లూ—ఇప్పటివరకూ చాలా విచిత్రంగానే ప్రవర్తించాం —ఇట్లాజరుగుతుందని నీవం నేనూకూడా ఊహించుకో లేకపోయానాను.ఇక

ముందు మన స్నేహాన్ని అభివృద్ధి పరచుకోవటం శ్రేయస్కరం—ఏమంటావు? "

అంటూ, ఆమె దగ్గరగా వచ్చి కాఫీ కప్పు అందుకున్నాడు.

అతని మాటలకు నిర్మల మళ్లీ అనుకోకుండానే నవ్వింది. శంకరం కేసి చూస్తూనే నవ్వింది. ఆ నవ్వు అర్థం చేసుకున్నవాడల్లే శంకరంకూడా కాఫీ తాగుతూనే ఒకసారి నవ్వాడు.

ఇన్నాళ్లకు— మొదటిసారిగా— ఇరువురూ మాట్లాడుకొని, నవ్వటంమూలాన తిరిగిమామూలు ప్రపంచంలో పడ్డట్టేకూడా భావించుకున్నారు. అంతేకాదు— ఈ ప్రపంచంలో వర్షాలే కురిసినై. ఎండలే కాసినై. పంటలే పండినై. ఆ క్షణంనుంచీ వీరిఇరువురి జీవితనాటకంలోనూ ఒకకొత్త అంకమే ప్రారంభించిం దనికూడా చెప్పవచ్చును.

౧౦

శలవలు పదిరోజులప్పుడే అయిపోయినై. మిగిలి ఉన్నవి మరి అయిదురోజులుమాత్రం.

ఇంతకాలం శంకరం నిర్మలా ఎంత ఎడంగా ఉండేవారో ఇప్పుడు — ఈపదిరోజుల్లోను అంత సన్నిహితులు అయిపోయినారంటే ఆశ్చర్యంవేయక మానదు. ఏమాత్రమయినా ప్రేమించే శక్తి ఉన్న వారు సన్నిహితులవుతే వారిప్రేమ ఒకరిమీద ఒకరికి ఇన్ఫ్లుయన్స్ అయితీరుతుంది.

ఇన్నాళ్ళుగా లేనిది — ఈఊళ్లో, ఇప్పుడు తను శంకరానికి సన్నిహితురాలెట్లా అయిపోయిందీ నిర్మల తన మనస్సులోని ఊహాలన్నీ సింహావలోకనం చేసి చూసుకున్నది. ఇంతమంచి హృదయం గల శంకరాన్ని ఇన్నాళ్లూ ఎట్లా ధిక్కరించి పారేసింది? ఎందుకూ కొరగాని ఆలోచనలతో ఇంత కాలం శంకరాన్ని ఏకారణంచేత దూరంగాఉంచింది?

ఏళ్ళకైక ఆమె ఇంతవరకూ వెరుస్తూ వచ్చింది ?

ఈనాడు తన హృదయాన్ని తనే పరీక్షించి చూసుకోగా చివరకు ఏమీలేదనిమాత్రం తేలింది.

జ్ఞానం ప్రకాసించకముందే తను భర్తృవిహీన అయినప్పటికీ, జ్ఞానం వచ్చినాక క్రమేపి తన స్థితి తానుబాగా అర్థం చేసుకోగలిగింది. అప్పట్నుండీ ఆమె మనస్సు ఒక విధమైన అంతర్వేదనకు గురి అయిపోయినది. తన భావి జీవితం ఎందుకూ పనికి రాకుండా అవుతుందేమో ! జీవితాంతం వరకూ తను ఒంటరిగానే ఉండవలసి వస్తుందేమో ! ఒక వేళ సాంఘిక పరిస్థితులే తన కనుకూలంగా ఉంటే- తనకు ఎటువంటి తేభ్యం భర్త అవుతాడో ! ఇటువంటి ఆలోచనలన్నీ ఆచిన్నిహృదయాన్ని తీవ్రంగానే కలవరపెట్టసాగినై. ఆ కారణంచేత, కసీసం తనచదువైనా పూర్తి అయ్యేదాకా, భర్తా, ప్రేమా వీటిజోలికే పోకూడదని నిశ్చయించుకున్నది నిర్మల.

అయితే- కంకరం ఆమె ఆదర్శానికీ, నిశ్చ

యానికి కూడా అద్భుతగుణం కాదని ఆమె భావించి ఉండలేదు. పైగా, శంకరం అంటే మొదట ఎంత దూరంగా ఉండాలని ప్రయత్నిస్తూ వచ్చిందో రోజు రోజుకీ అంత సన్నిహితురాలవుతూ వచ్చి నట్టుకూడా ఇప్పుడిప్పుడే తనకు అర్థమయింది. తన హృదయానికి ఎదురుతిరిగి ఎంతవరకూ విజయం పొందలేక పోయిందో కూడా ఆమె ఇప్పుడే తెలుసుకో గలిగింది.

శంకరంకూడా సరీగ్గా ఇదే ఆలోచిస్తూ ఉండటం చిత్రమయిన విషయం. కాని, తానెంత ఆలోచించినా ఈ మనస్తత్వ పరిణామం ఏమిటో అర్థం చేసుకోలేకపోయినాడు.

చాలాకాలంనుంచీ శంకరాని కెవరెవరో కట్నాలతోసహా పిల్లల్నిస్తామంటూ వచ్చి పోతు న్నారు. ఆవేళ మరొకరెవరో రావటమున్నూ జరిగింది. ఈ విషయాన్ని నిర్మల భోజనంచేస్తూ తల్లినోటంట విని చప్పున పరధ్యానంలో పడి పోయింది.

క్షణం పోయినాక, మళ్లీ మామూలు మనిషి అవటానికి ప్రయత్నించే గొంతుకతో—

" పెళ్ళి నిశ్చయం అయినట్టేనా అమ్మా!" అంటూ ప్రశ్నించింది తల్లిని.

" నిశ్చయం కాక ఏమే పిచ్చితల్లీ! అంత కట్నంతో రత్నంలాంటిపిల్ల నస్తూఉంటేనే— "

పిల్లఅందంగా ఉన్నప్పుడూ, అంతకట్నంతో కలిసి వస్తున్నప్పుడూ ఏ తల్లిదండ్రులయినా, అటు వంటి సంబంధాలను తమ కొడుకులకు ఖాయంచేసు కుంటారేగాని, జారవిడుస్తారా ? నిర్మలతల్లి ఊహిం చిందికూడా అదే. తనఊహ కేవలం నిజం అయి నట్టే కూతురుతో చెప్పటంలో తన తప్పేముంది ?

శంక రానికే తన కూతుర్ని స్తే ? ఆ ఊహ ఆమెకు కలగక పోలేదనటానికి సందేహం లేదు. కాని, లక్షణమయినటువంటి పిల్లవాడికి విధవపిల్లను కట్టిపెట్టటమంటే, ఆ తల్లిదండ్రుల చేతులెట్లావస్తై ?

అదట్లా ఉండగా, తను ఏకంఠంతో అడుగు

తుంది పార్వతమ్మను, శంకరానికి తన కూతుర్ని చేసుకోమని? ఈఆలోచన లేనాడో చేసి నిర్మలతల్లి కాస్త కన్నీళ్లతో కూడా తనమనస్సును విరిచేసు కుని ఊరుకొన్నది.

తల్లిమాటలు నమ్మకుండా ఉండటం ఎట్లానో నిర్మలకు చాతకాలేదు. ఇంతవరకూ ఆమె అటు వంటి పని ఎన్నడూ చేసికూడా ఎరగదు. కనీసం శంకరాన్నే ఇదేదో అడిగి నిజం బాగా రూఢిపరుచు కుందామంటే- సిగ్గూ, అసహ్యమూ, విరక్తీ అన్నీ ఒక్కసారిగా అనుకోకుండా ఆమె నావరించినై. గట్టిగా ఒకసారి ఏడవ్వాలని ప్రయత్నిద్దామంటే, అదికూడా ఆమెస్వాధీనంలో లేక, తననిస్సహాయత పైన తానే కోపం తెచ్చుకున్నది.

తన మనస్సు తన్నెంత పాడుచేసింది! తన ఆలోచనలు ఎంత విలువ లేనివిగా అయిపోయినై!

సాయంత్రం మామూలుగానే శంకరం వచ్చా డు. 'ఈ వేళ నా వొంటో బాగా లేదు' అని తప్పిం

కోవాలని చూసింది నిర్మల. కాని, 'నీకో మంచి విషయం చెపతాను- రా' అంటూ బలవంతంపైన ఆమెను షికారు తీసుకపోయినాడు శంకరం.

ఇద్దరూ చాలాదూరం మౌనంగా నడిచారు.

ఏ పక్క చూసినా పెద్ద చెట్లూ, రాళ్లూ తప్ప మరొకటి కానరాలేదు. మరి కాస్త దూరం పోయి చిన్న గడ్డ ఒకటి ఉంటే దాని తీరాన్నే ఇద్దరూ కూర్చున్నారు.

గడ్డలోని నీరు చిన్న చిన్న రాళ్ల మీదుగా పోతూ, చప్పుడుచేస్తూ ఉంది ఉండుండి.

మరీ దూరంలో ఏ పొలాలమూలనుండో చిన్న పల్లెపదాలు వినవస్తున్నై. ఆ ప్రాంతంలో జన సంచారం అసలు లేనే లేదనికూడా చెప్పవచ్చును.

ఉండుండి శంకరం అన్నాడు —

"నువ్వీ వాళ ఎప్పటి మల్లేనే లేవు. అమ్మ ఏమయినా అన్నదేమిటి ?"

శంకరాన్ని ముఖమెత్తి చూడకుండానే నిర్మల

అన్యమనస్కంగా జవాబు ఇచ్చింది —

" అమ్మ అనటమేమిటి ? "

" మరేంమ చేత అట్లా ఉన్నావు ? "

" ఎట్లా ? "

ఆమె అన్యమనస్క తను చప్పున కనిపెట్టాడు శంకరం. ఏవిధంగా అయినా తన వాతావరణం లోపలికి లాక్కుపోయి ఆమెను నవ్వించాలని శంకరం ప్రయత్నంచేశాడు. చివరికి ఈవిధంగా అన్నాడు -

" నాకు పిల్లనిస్తామంటూ ఎవరో వచ్చారు తెలుసా ? "

" విన్నాను. "

" ఎప్పుడు ? "

" అమ్మ చెప్పింది. "

" ఇంకా ఏం చెప్పింది ? "

" నిశ్చయ మయిపోయిందటగా ! "

ఈమాట నిర్మల జీవంలేని నవ్వుతో అన్నది. కాని, ఆ నవ్వులో జీవం ఉన్నదీ లేనిదీ శంకరం

కనిపెట్టలేదు. సరీగ్గా అదే సమయంలో తను ఒక చెట్టుమీద ఉన్న పక్షుల జంటను చూస్తున్నాడు.

నిర్మల నవ్వుతూ పలికినమాటలు విని —

" అమ్మయ్య ! ఎంతసేపటికి నవ్వావు ! " అన్నాడు శంకరం. నిర్మలకు మళ్లీ ఏదో సందేహం బాధించటం మొదలుపెట్టింది.

" ఎప్పుడు పెళ్లి ? " అన్నది చప్పున.

" ఎవరికి ? "

ఆమె విసుగ్గా తిరిగి నవ్వింది.

" నీ కా పిల్లతో నిశ్చయ మయిందనే చెప్పింది. " అన్నది.

" ఏ పిల్ల ? "

శంకరం, అన్నీ తెలిసికూడా తనతో ఇంత మొండిగా ఎందుకు మాట్లాడుతున్నాడు ? తన హృదయాందోళనను శంకరం ఎందువల్ల కనిపెట్టడు? తనసందేహాన్ని ఎందువల్లతీర్చడు ? తనను మోసమే చేయదలచుకున్నాడా ? లేకుంటే ఏమిటీ ధోరణి ? నీకోసం నా హృదయం ఆరాటపడుతున్నది అని

తన నోటంటచెపితే శంకరానికి వినాలని ఉందా ? పోనీ— తనవిషయం తనే పూర్తిగా నిర్భయంగా అతనితో మాట్లాడేస్తే ? ఏం? శంకరం తన్నెందుకు అర్థంచేసుకోకుండా ఉన్నాడు ?

"ఇంకా నిశ్చయంకాలేదు. అసలు నాదాకా కూడా రాలేదు." అన్నాడు శంకరం.

ఈ మాటలు ఆమె చెవిలో ఏదో లీలగా పడినై. నిశ్చయంకాకున్నా ముందైనా నిశ్చయం అయితీరే సంబంధం అది— శంకరం మాత్రం— తనను పూర్తిగా అర్థం చేసుకోని ఈ శంకరం మాత్రం— తనదాకా వచ్చాక ఆ పిల్లను— అంత డబ్బుతో వస్తున్నదాన్ని — ఎందుచేత తోసి పారేస్తాడు ?

తనలో ఏముంది ? డబ్బు లేదు తనకు- పైగా వైధవ్యం — తనలో ఏం చూసి శంకరం తన్ను పెళ్లాడతాడు ?

నిర్మలకి ఆలోచనలతో పిచ్చిపిచ్చిగా వెలికి నవ్వొకట వచ్చింది. ఇద్దరూ మౌనంగానే తిరిగి ఇల్లు చేరుకున్నారు.

౧౧

ఆ రాత్రి యావత్తూ నిర్మల తన అంతరాత్మతో ఘోరాఘోరీ యుద్ధంచేసింది. తనా స్థితిలో ఉండటం చేత నేకద శంకరానికంత చులకనగా ఉంది! లేకుంటే శంకరం తనతో ఎందుకనడూ, నేను నిన్ను తప్ప మరొకరిని వివాహమాడను అని? తన హృదయాన్ని శంకరం ఈపాటేనా అర్థం చేసుకున్నది? అతను ఆ ఒక్క మాట అంటే, నిజంగా తనకెంత తృప్తి! తను ఆ తరువాత శంకరంతో ఎంత నిర్భయంగా హృదయం విప్పి తృప్తితీరా మాట్లాడి ఉండును!

తన హృదయాన్నే అవగాహన చేసుకో లేని ఈ శంకరాన్ని కోరటంకన్నా మూర్ఖత మరొకటి ఉందా?

ఈ ఆలోచనలతోనే ఆ రాత్రంతా నిద్ర పోగొట్టుకున్నది నిర్మల.

తెల్లవారకట్ట చిన్న కునుకుపట్టింది... అది కలతనిద్ర అవటంచేత నిర్మల అలస్యంగా లేచింది... లేస్తూనే తల్లితో అన్నది—

" అమ్మా! నేను ఇప్పుడే మామయ్య దగ్గరకు వెళ్ళిపోతున్నాను."

తల్లి పెరట్లో ఏదోపని చూసుకుంటున్నది. కూతురి మాటలువిని విస్తుపోయి లోపలికివచ్చింది.

" అదేమిటే_ఇంత ఆటాత్తుగా ఇట్లాఅంటు న్నావు—పిచ్చా ఏమిటి? రేపోఎల్లుండో నువ్వూ శంకరం కలిసే వెళ్తారేమో!"

నిర్మలకు శంకరం ఊసు తలచటమే అంత కంతకు ఏవగింపు అవుతున్నది. ముఖమైనా కడుక్కో కుండా, తొందరగా తనపెట్టే పుస్తకాలూ సర్దు కొనటం ప్రారంభించింది.

" అతనికి ఇంకా శలవులున్నై. నాకు లేవు. నేను రేపే కాలేజీలో జాయిన్ అయితీరాలి. ఇప్పుడు - మరోగంటలో బయలుదేరాలమ్మా!"

కూతురి అడావుడి చూసేసరికి తల్లికి అమిత భయం వేసింది.

"మరి నీకు తోడెవరే?" అన్నది గాభరాగా.

"తోడెందుకూ? ఏం భయమూ ఏమిటి?"

నిర్మల భోజనం చేసి ప్రయాణానికి సిద్ధమయినాక తల్లి మళ్ళీ అన్నది—

"శంకరానికి తెలుసా నీ ప్రయాణం గురించి?"

నిర్మల జడకు రిబ్బను అల్లుకుంటూ జవాబిచ్చింది—

"తెలును—ఏమైనా ఇబ్బంది లేదు." ఈ చివరిమాటలు అస్పష్టంగా అన్నది.

కూతురు మళ్ళీ పట్నం వెళ్ళిపోతున్నదే అని తలుచుకుంటేనే నిర్మలతల్లికి భయమూ, దుఃఖమూ ముంచుకొస్తున్నై.

ఆమె దుఃఖాన్ని దిగమింగుకుంటూ కూతురికి తనవేదన కనపడనీయకుండా మళ్ళీ అన్నది—

"అత్తయ్యతో చెప్పావా నువ్వు వెళుతున్నావని?"

"చెప్పాను-"

తల్లితో ఇదివరకు నిర్మల ఎన్నడూ అబద్ధం ఆడిఎరుగదు. అబద్ధాలాడవలసిన అవసరంకూడా కలగలేదు. కాని, ఇవాళ నిద్రలేచిన దగ్గర్నుండీ తల్లితో ఒక్క నిజంకూడా పలకలేదు! ఒక్క ప్రశ్నకు కూడా సరిఅయిన జవాబు ఇవ్వలేదు. తనలోని ఈ మార్పు తను కోరి తెచ్చుకున్నదే గనక తన ప్రవర్తనవిషయమై ఆమెకు ఏమీ ఎక్కువ ఆశ్చర్యమునూ్నా కలగలేదు.

బండిఎక్కేముందు అప్రయత్నంగా నిర్మలకు దుఃఖం ముట్టుకొచ్చింది. దాన్ని అణచుకొని, మనసులో ఆ గ్రామానికీ, ఆ ఇంటికీ, ఒక నమస్కారం పెట్టుకున్నది. మరితనజన్మలో ఇక్కడికి రాకూడదనే ఆమెసంకల్పం. కాని, ఎదురుగా కళ్ళుతుడుచుకుంటూ నిలబడిఉన్న తల్లిని చూసి తనూ కొంగు

చాటున కళ్ళు తుడుచుకొని బండి ఎక్కింది.

నిర్మల వెళ్ళిపోయిన ఒక అరగంటకు శంకరం వచ్చాడు ఆమెకోసం.

" ఏం బాబూ ! నిర్మల ఇప్పుడే వెళ్ళిపోయిందే ! " మడిలో ఉన్న నిర్మలతల్లి వంటింటిలో నుంచి పైకివస్తూ అన్నది. ఆ మాటకు శంకరం ఆశ్చర్యపడ్డాడు, అర్థంకాక.

" ఎక్కడికి వెళ్ళింది ? " అని అడిగాడు.

"ఏం ? నీకు తెలీదు నాయనా పట్నం వెళుతున్నట్టు ? "

" పట్నమా ! "

శంకరం నిర్ఘాంతపోయి చూసేసరికి నిర్మల తల్లిగూడా నీరయింది.

ఆమె పొద్దుటజరిగిన కథంతాగబగబా తడుముకుంటూ చెప్పేసరికి శంకరం నోట మాటరాలేదు. అతనికిముందూ వెనకా ఏమీ అర్థంకాలేదు. నిర్మల పరివర్తన అంతకన్నా బోధపడలేదు.

## ౧౨

ఇప్పుడు తను చేయవలసినపని స్టేషనుకు పరుగెత్తటమే. బండి బయలుదేరటానికి మరొక అరగంట మాత్రమే వేళఉంది. జట్కా మీద పోతే బండికి అందవచ్చును.

ఎన్నడూలేని ఎండంతా ఆనాడేఉన్నట్టుంది. అంతఎండలోనూ శంకరం పరుగుపరుగున పోయి దొరికిన జట్కాఎక్కి స్టేషనుచేరి ఆ తరవాత పర్సు చూసుకున్నాడు. దాని ధర్మమాఅంటూ ఒక పది రూపాయల నోటుమాత్రం ఉంది. రైలు బయలు దేరటానికి అయిదునిముషాలే ఉంది.

శంకరం పట్నానికి వెంటనే టిక్కెట్టు పుచ్చుకున్నాడు. ఆ బండిలోనే నిర్మలతోసహా పట్నం వెళ్ళిపోవటానికే అతని నిశ్చయం. అదీ కాక, ఆమెతో, ఈ విషయమేమిటో, ఇట్లాతనతోకూడా చెప్పకుండా బయలుదేరటానికి కారణమేమిటో,

అవశ్యం అడగవలసిఉంది. ఈ సమయంలో తను ఇప్పుడు చేస్తున్నపనికన్నా ఉత్తమమైనది తనకు తోచ లేదు.

టికెట్టు పట్టుకుని ప్లాటుఫారంమీదకు పరుగెత్తాడు. ఇంజనునుండీ గార్డుపెట్టెవరకూ అన్నీ ఒక్కసారి చూశాడు. కాని, నిర్మల ఒక్కపెట్టెలో కూడా కానరాలేదు.

శంకరం మతిపోయినవాడిలాగ అయిపోయి తిరిగి అన్నిపెట్టెలూ వెతకటం ప్రారంభించాడు.

ఆడవాళ్ళ పెట్టెలో అవతలవేపు ముఖం పెట్టి కూర్చున్న ఒక అమ్మాయిని చూశాక, "నిర్మలా!" అని తనకంఠందాకా వచ్చిన కేక, ఆ అమ్మాయి కాస్త ఘటాలున ఇటుపక్క తిరిగే సరికి, తన కంఠంలోనే అణిగిపోయింది. శంకరం గుండె నిలిచిపోయిన పర్యంతం అయింది.

ఈసారికూడా అతనిప్రయత్నం పూర్తిగా వ్యర్థమయింది. అంతలోనే బండికూడా కదిలింది.

అరరే! మరొక్కసారి చూసిఉంటే?– అట్లాఆలోచిస్తూ, అన్ కాన్షస్ గా బండీ పోతూఉండగానే, దానివెంట మెల్లిగా పరుగెత్తటం ప్రారంభించాడు. ప్లాటుఫారం చివరివరకూ ఏ ఆలోచనా లేకుండా వెర్రిగా అట్లా పరుగెత్తి, బండిదాటాక నిలబడి పోయినాడు. ఇప్పుడు అతని బుర్రలో అనేకమైన ఆలోచనలు ఒకదానివెనక ఒకటి వచ్చినై.

రైల్లో ఏపెట్టెలోనన్నా దాక్కుందేమో! తనంతగామరి వెతికాడే! అదీకాక, అంతదొమ్మిలో ఎట్లాదాక్కుంటుంది? తనూ రైలెక్కిపోయి ఉంటే! వచ్చేస్టేషనులో అయినా మరోసారి వెతికి ఉండునే! ఎంతపనిఅయిపోయింది! నిశ్చయం-ఆమె రైల్లో తనక్కనపడకుండానే వెళ్ళిపోతూ ఉంది!

కనుమేర దృష్టిలో బండీ మలుపు తిరిగే వరకూ అట్లా చూసి చూసి ఒక్కసారి బరువైన ఊపిరి వదిలి, చేతి రుమాలుతో కళ్ళుతుడుచుకుంటూ వెనక్కు తిరిగాడు శంకరం.

ఎదురుగా నిర్మల !

ఆమె బొమ్మలాగా నిలబడి ఉంది శంక రానికి కళ్ళు ఒప్పగించి,

శంకరం కూడా అంతకు తక్కువ స్థితిలో లేడు. దాదాపు ఒక షెల్ష్ న్ మార్క్ అయిపోయి నాడు శంకరం. అతని హృదయం తీవ్రంగా కొట్టు కోసాగింది.

" అరె ! ... నువ్వు ... " అని అంతకు మించి ఏమీ అనలేక పోయినాడు శంకరం.

అసలు, శంకరంపైన ఆశలన్నీ పూర్తిగా విడిచేసుకుని నిర్మల సేవను చేరింది. తనకోసం శంకరం అట్లా వస్తాడని ఆమె ఏ క్షణంలోనూ ఊహించలేదు. శంకరం రావటం ఎరిగి, దేనికోసం వచ్చాడో నిర్ధారణ చేసుకోలేక, అతన్ని తప్పించు కుంటూ అంతా కనిపెట్టింది.

శంకరం ఆ సమయంలో అక్కడ చేసిన ప్రతీ పనికి ఆమె ఒక్కొక్క కన్నీటిబొట్టురాల్చింది.

ఆఖరుకు ప్లాటుఫారం చివర శంకరం కళ్లు తుడుచు కుంటూ ఆమెకు కనపడేసరికి ఆమె కన్నీళ్ళన్నీ అయిపోయినై. దానితో ఆమె హృదయంలోని ఆరాటాలన్నీ అమూలాగ్రంగా నశించినై.

శంకరం చేతిరుమాలుతో ఒకసారి ముఖ మంతా తుడుచుకుని—

" ఏమిటిది నిర్మలా ? " అన్నాడు.

నిర్మల కొంత తేరుకుని జవాబిచ్చింది.—

" నీకోసం నేనొకవ్వడు పడినంత ఆరా టమూ, నీవు నాకోసం కూడా పడతావని నే ననుకోలేదు. ఏదో పిచ్చిభ్రమలో పడ్డాను అంతే."

"చాలా మంచిపనిచేశావు! ప్రమాదస్తు రాలల్లేనే ఉన్నావే! నువ్వీఊరినుంచి వెళ్లిపో తే నేనుమాత్రం ఎందుకూ ఇక్కడ ? "

తనకెంత అజ్ఞానం ఎట్లా ముంచుకొచ్చిందో పోల్చుకోలేకపోయింది నిర్మల. అక్కడే నిలుచున్న పాటున ఒక్కసారిగా ఆమె కళ్లంట నీళ్లుకారినై.

ఈ కన్నీళ్లు మునుపటి కన్నీళ్లే కావు. ఈ నిర్మల నిన్నటి నిర్మల కాదు. ఏ ఆరాటాలూ లేని నిర్మలమైన కన్నీళ్లతో ఆమెహృదయంలోని భార మంతా పూర్తిగా తీరిపోయిందికూడా.

నిర్మల అట్లా ఇంకా ఏడవటంచూసి శంకరం ఆమె కన్నీళ్లుతుడిచి లాలించాడు —

"ఛా— ఇట్లా ఏడవ్వచ్చా! నేను అంతా అర్థంచేసుకున్నా నిప్పుడు. ఇందులో నాతప్పుకూడా లేకపోలేదు. ఇద్దరమూ ఒకరికొకరం ఏ విషయం లోనూ తీసిపోవటంలేదు లే. పద— ఇంటికిపోయి ఒక పర్యాయం అమ్మకూ అత్తకూ నమస్కారాలు చేద్దాం."

శారదా ప్రెస్, అనకాపల్లి.

# రంగనాధరావు రచనలు

—• అచ్చయింది •—

| | | |
|---|---|---|
| అశ్రుగీత | [ ఎలిజీ ] | 0 4 0 |

—• అచ్చు కాబోతున్నవి •—

| | | |
|---|---|---|
| చెడిన మనిషి | [ కథలు ] | 0 6 0 |
| దిగంతం | [ కథలు ] | 0 6 0 |
| సావిత్రి | [ నవల ] | 0 6 0 |
| స్టార్ ఓవర్ నైట్ | [ కథలు ] | 0 6 0 |
| గొప్పింటి పిల్ల | [ కథలు ] | 0 6 0 |

శారదా ప్రచురణాలు : అనకాపల్లి.